జీవన్ మరియు హను విశిష్ట వస్తు అన్వేషకుల జంట మీకు అంద జేయు:

# ప్రపంచపు వింతలు!

ప్రపంచంలో అతి వేగవంతమైన జంతువు **చిఱుతపులి**, దాని వేగం, ఒక గంటకు 70 మైళ్ళు.



ప్రపంచంలో అతి పెద్దగంతు **కంగారూది**, అది 42 అడుగుల దూరం దూకగలదు, అంటే ఒలింపిక్ ప్రమాణం కంటే 12 అడుగుల 9 అంగుళాలు ఎక్కువ.



ప్రపంచంలో కెల్లా పెద్ద జంతువు, **నీలి తిమింగలము**, దాని పొడవు 106 అడుగులు బరువు 195 టన్నులు.

ప్రపంచంలో అతి క్షారవంతమైన సముద్రం జోర్డానకీ, ఇజ్రాయల్‌కీ మధ్యవున్న **డెడ్ సీ**, దీని నీటి సాంద్రత ఎంత ఎక్కువ అంటే, మనం దాని నీటి మీద కూర్చో వచ్చు

ప్రపంచంలో అతి నిడివిగల వృక్షం, కాలిఫోర్నియన్ **సెకోయా**, దాని మందం 30 అడుగులు ఎత్తు 272 అడుగులు.





జీవిత భీమా భవిష్యత భద్రతకు మిక్కిలి నమ్మకమైన, క్షేమకరమైన మార్గము.

లైఫ్ ఇన్సూరెన్స్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా

తరువాత: జీవన్ మరియు హను ప్రపంచపు అద్భుతాల పరిశీలనలో.

# ఫ్లాష్ వాడండి, చిరునవ్వులను చిందించండి.

మీరిప్పుడు తాజాదనంతో చిరునవ్వు
చిందించేందుకు కారణాలు :

**ఫ్లాష్ చిందించే తాజాదనం :**
ఫ్లాష్‌లోగల నీలపు పదార్థం నోటిలోని దుర్గంధాన్ని, క్షయకారకమైన పురుగులను దూరం చేస్తుంది.

**ఫ్లాష్ వల్ల ఆత్మవిశ్వాసం :**
ఫ్లాష్‌లో మీ దంతాలను, చిగుళ్ళనూ మరియు మీ నోటినంతనూ కాపాడేవన్నీ ఉన్నాయని మీరు తెలుసుకున్నందువల్ల వచ్చేదిది.

**ఫ్లాష్ యొక్క రుచి :**
అమ్మమ్మ...మురిపింపచేసే రుచి ..మరి కాసేపు బ్రష్ చేసుకోవాలనిపింపజేసే రుచి.




## ఫ్లాష్

టూత్ పేస్ట్ తాజాదనం చిందించే నీలపుపదార్థం గలది.



everest/80/FL/294-TL

# శ్రద్ధాంజలి

## శ్రీ కొడవటిగంటి కుటుంబరావు

జననం: 28-10-1909 | మరణం: 17-8-1980

దాదాపు ముప్ఫై సంవత్సరాలుగా "చందమామ" సంపాదకవర్గంలో ముఖ్యుడిగా వుంటూ, 'చందమామ' అభివృద్ధికి దోహదం చేసిన సుప్రసిద్ధ రచయిత శ్రీ కొడవటిగంటి కుటుంబరావు – 'చందమామ'ను, అసంఖ్యాక పాఠకులనూ అభిమానులనూ మిత్రులనూ బంధువర్గాన్నీ వదిలిపెట్టి వెళ్లిపోయారు! రచయితగా తెలుగు దేశంలో కుటుంబరావు – ఎంతటి సుప్రసిద్ధులో వేరుగా తెలియజేయనవసరం లేదు. కథకుడుగా, విమర్శకుడిగా, వ్యాస, నవలా రచయితగా ఆయన సాధించిన ఖ్యాతి పాఠకలోకానికి సుపరిచితమే.

అయితే, మహా రచయితగా తన అనుభవాన్ని రంగరించి - చక్కని తేలిక భాషలో 'చందమామ' పాఠకులకు ఆయన చెప్పిన వేలాది కథలు — బాల సాహిత్యంలో ఆణిముత్యాలు! తన విశ్వాసాలు, నమ్మకాలూ ఎలాంటివైనా, 'చందమామ' పాఠకుల కోసం ఆయన విశేషమైన కృషి చేసి, సేకరించి, అందజేసిన ప్రాచీన ఇతిహాసాలు, పౌరాణిక గాథలూ, ఆ శైలీ మరవరానివి. స్వర్గీయ శ్రీ చక్రపాణి ఆశయాలకు రూపం కల్పించి, తన శైలితో, పాఠకలోకాన్నీ తక్కిన పత్రికలనూ ఆకర్షించిన మేధావి - శ్రీ కుటుంబరావు. 'చందమామ'లో ఎవరు ఏ కథ రాసినా, ఆ కథకు మెరుగులు దిద్ది, అందం తెచ్చి, చదివింపజేసిన ఘనత ఆయనదే. 'చందమామ' కోల్పోయినట్టే, అసంఖ్యాక పాఠకులు కూడా శ్రీ కుటుంబరావు 'తేట తెలుగు తేలిక శైలి'ని కోల్పోవడం–దురదృష్టకరమైన విషయం.



వ్యక్తిగా కూడా ఆయన –– అంతటి ఉన్నతుడు. నిజమైన 'సహృదయుడు'. ఇన్నేళ్ల సహవాసం తర్వాత- తన 'పితృ'తుల్యుని 'చందమామ' పోగొట్టుకున్నది. ఆ ఆత్మబంధువుకు, మహామనీషికీ, 'చందమామ' మనసారా తన శ్రద్ధాంజలి ఘటిస్తున్నది.



# చందమామ


సంస్థాపకుడు : 'చక్రపాణి'

సంచాలకుడు : నాగిరెడ్డి


---

ఈ నెల బేతాళకథ [ ''నోటిదుర్గుసు'' ]కు ఆధారం వసుంధర రచన.

''అక్రమసహాయం'' అన్న కథలో మనం గమనించ వలసింది ఏమిటంటే, సంఘవిద్రోహకమైన జూదమూ, తాగుడూ లాటివి ఆధారం చేసుకుని లాభం పొందేవాళ్లు ఉంటారు. ఈ కథలో అలాట వాడికి ప్రాయశ్చిత్తం జరిగింది.

## అమరవాణి

ఉద్యమేన హి సిధ్యంతి కార్యాణి, న మనోరథైః,
న హి సింహస్య సుప్తస్య ప్రవిశంతి ముఖే మృగాః.

[కోరికలున్నంతమాత్రాన పనులు సఫలంకావు. దానికి ప్రయత్నం కావాలి. నిద్రపోయే సింహంనోట్లో మృగాలు ప్రవేశించవు]

---


సంపుటి 67 సెప్టెంబర్ '80 సంచిక 3

విడి ప్రతి : 1-50 : : సంవత్సర చందా : 18-00


5




సామవేదం శ్రీనివాస అనంత రవి

ప్ర ; రాకెట్ నిర్మాణమును, పనిచేయు విధమును గురించి వ్రాయవలసినదిగా కోరుచున్నాను.

స : దీపావళినాడు మనం కాల్చుకునే సరంజామాలో రాకెట్ కూడా ఉన్నది. అది పనిచేసే సూత్రం అర్థం చేసుకోవటం చాలా తేలిక. తెడ్డువేసి నీటిని వెనక్కు తోస్తే పడవ ముందుకు పోవటం మనకు తెలుసు. దీపావళి రాకెట్‌ల దిగువ భాగం నుంచి "పొగ" అమిత వేగంతో కిందికి వస్తుంది. ఆ "పొగ"కు గల శక్తి తాలూకు ప్రతిశక్తి రాకెట్‌ను పైకి తోస్తుంది. అయితే మనం మంట చూపించే దాకా రాకెట్‌లో ఏ పొగా ఉండదు, "మందు" మాత్రమే ఉంటుంది. అది అంటుకుని వాయురూపం పొందుతుంది. ఘనపదార్థంలో ఉన్న ఇంధనం వాయురూపం పొందేటప్పుడు కొన్ని వందల రెట్లు అవుతుంది. దానితోబాటు రాకెట్ లోపలి భాగంలో అమితమైన ఒత్తిడి ఏర్పడి, వాయురూపం ధరించిన ఇంధనాన్ని బయటికి నెట్టుతుంది.

జెట్ విమానాలలో జెట్ ఇంజన్లు కూడా ఇదే సూత్రం మీద పని చేస్తాయి. కాని అసలైన రాకెట్‌కూ, జెట్‌కూ కొన్ని తేడాలు ఉన్నాయి. అవి ఇప్పుడు మనకు అనవసరం.

రాకెట్‌లో వాడే ఇంధనం ద్రవరూపంలో గాని, ఘనరూపంలో గాని ఉండవచ్చు. ("రోహిణి" ఉపగ్రహాన్ని శ్రీహరికోట నుంచి ప్రయోగించి నప్పుడు ఘనరూపంలో ఉండే ఇంధనాలే వాడారు.) ఈ ఇంధనాలు శూన్యాకాశంలో కూడా దహనం కావాలంటే, గాలిలో ఉండే ప్రాణవాయువు మీద ఆధారపడి లాభంలేదు.. ఎందుకంటే అంతరిక్షంలో గాలి ఉండదు. రాకెట్‌ను నడపటానికి సాధారణంగా రెండు రకాల ఇంధనం ఉంటుంది: ఒకటి మండేదీ, రెండోది మండించేదీ—అంటే ప్రాణవాయువు. సాధారణంగా ప్రాణవాయువు ద్రవరూపంలో ఉంటుంది. సాధారణ శీతోష్ణస్థితిలో ప్రాణవాయువు వాయు రూపంలో ఉంటుంది గనక, ద్రవరూపం కలిగించటానికి దాన్ని చాలా చల్లగా చేయాలి. వాయురూపం పొందిన ఇంధనం అమితమైన ఫోర్స్‌తో బయటికి వస్తేగాని రాకెట్ వేగం పుంజుకోదు. ఇంధనశక్తిని బట్టి ఒక రాకెట్ చాలకపోతే మూడు నాలుగు రాకెట్ అంచెలు కూడా ఉపయోగిస్తారు. "రోహిణి"కి నాలుగు రాకెట్ అంచెలు ఉపయోగించారు.



## 87

### హంసరాజూ, నెమలిరాజూ

ఉత్తరాన కర్పూరద్వీపంలో పద్మకేళి అనే సరస్సు ఉండేది. అందులో హిరణ్యగర్భుడు అనే రాయంచ నీటిపక్షుల కన్నిటికీ రాజుగా ఉండేది. అది తన ప్రజలైన పక్షులను రక్షిస్తూ, వాటి మన్ననలను పొందుతూండేది.

అక్కడికి అయిదు వందల మైళ్ళ దక్షిణంగా వింధ్యపర్వతాలలో చిత్రవర్ణుడు అనే నెమలి, నేల మీద నివసించే పక్షుల కన్నిటికీ రాజుగా ఉండేది.

ఒకనాడు దీర్ఘముఖుడు అనే కొంగ సంచారం చేస్తూ, వింధ్యపర్వతాలకు వచ్చి, ఆహారం కోసం వెతుకుతూండగా, కొన్ని వేల పక్షులు దాన్ని చూసి, "నీది ఏ దేశం? మీ రాజు ఎవరు?" అని అడిగాయి.

"మాది కర్పూరద్వీపం. మా రాజు దైవాంశగల హిరణ్యగర్భుడు. మాది భూలోకస్వర్గం," అన్నది కొంగ. అది అంతటితో పోనియ్యక, గర్వంగా, "మీరంతా ఈ అడివి ప్రాంతం వదిలి, మా కర్పూరద్వీపం వచ్చెయ్యండి," అన్నది.

"తిండికోసం మా దేశం వచ్చినవాడికి ఇంత పొగరు తగదు!" అని నేలపక్షులు కొంగను మందలించాయి.

అంతతో పోట్లాటసాగింది.

"హిరణ్యగర్భుణ్ణి రాజు చేసినదెవరు?" అని నేలపక్షులు అడిగాయి.

"చిత్రవర్ణుణ్ణి రాజు చేసినదెవరు?" అని కొంగ అడిగింది.

"చిత్రవర్ణుడు జంబూ ద్వీపాని కంతటికీ రాజు. మీ కర్పూరద్వీపం అందులోదే!" అన్నాయి నేలపక్షులు.



"మాటలతో రాజ్యాలు జయించేటట్టుంటే మీరన్నది నిజమే! జంబూద్వీపానికంతటికీ తానే రాజునని మా హిరణ్యగర్భుడు కూడా నిరూపించగలడు," అన్నది కొంగ.

"ఎలా?" అని నేలపక్షులు కోపంగా అడిగాయి.

"యుద్ధంచేసి!" అన్నది కొంగ.

"యుద్ధం మేమూ చెయ్యగలం! మీ రాజు ఎంత బలవంతుడైనా మేం యుక్తితోనైనా జయించగలం," అన్నాయి నేల పక్షులు.

తరవాత అవి కొంగను చిత్రవర్ణుడి వద్దకు తీసుకుపోయి, జరిగినదంతా చెప్పాయి. రాయబారిగా పనిచేసే చిలక, కర్పూరద్వీపం జంబూద్వీపం లోనిదేనని చెప్పింది. చిత్రవర్ణుడు కూడా జంబూద్వీపానికంతటికీ తానే రాజు గనక, కర్పూర ద్వీపానికి కూడా తానే రాజునన్నది.

దీర్ఘముఖుడు ఇందుకు ఒప్పుకోక, తమ రాజు హిరణ్యగర్భుడే జంబూద్వీపానికంతటికీ రాజని వాదించింది.

"ఆ మాట ఎలా రుజువు చేస్తారు?" అని చిత్రవర్ణుడు అడిగింది.

"యుద్ధంచేసి!" అన్నది కొంగ. అది ఇంకా ఇలా అన్నది:

"మీరు ఒక రాయబారిని మా రాజు వద్దకు పంపి, మీ ఏలుబడి ఆమోదించక పోతే యుద్ధం చేస్తామని ప్రకటించి, ఏం జరిగేదీ చూడండి!"

చిత్రవర్ణుడి మంత్రి దూరదర్శనుడు అనే గద్ద చాలా వివేకం గలది. హిరణ్యగర్భుడి మంత్రి ఎవరని అది దీర్ఘముఖుణ్ణి అడిగితే, సర్వజ్ఞుడనే చక్రవాకం అని జవాబు వచ్చింది. చక్రవాకం ఆ దేశానికి చెందినది గనక ఆ పదవికి తగినదే నని గద్ద అన్నది.

తన మంత్రి అయిన గద్దతో సంప్రతించిన మీదట చిత్రవర్ణుడు చిలకను తన రాయబారిగా హిరణ్యగర్భుడి వద్దకు



పంప నిశ్చయించింది. చిలక వెళ్ళటానికి ఒప్పుకున్నది గాని, దుర్మార్గుడైన దీర్ఘ ముఖుడి వెంట కర్పూరద్వీపానికి వెళ్ళ టానికి ఒప్పుకోలేదు.

"నేను ఏ విధంగా దుర్మార్గుణ్ణి?" అని దీర్ఘముఖుడు అడిగింది.

"నువ్వు నీ మాటలతోనూ, ప్రవర్తన తోనూ కయ్యం రేపావు. చాకచక్యంగా మాట్లాడే నేర్పు ఉండినట్టయితే పరిస్థితి సామ్యంగా ఉండటమే గాక, నీకు కొంత కీర్తి కూడా వచ్చేది." అన్నది చిలక.

దీర్ఘముఖుడు కర్పూర ద్వీపానికి తిరిగి వెళ్ళి, హిరణ్యగర్భుడికి జరిగిన దంతా చెప్పింది. హిరణ్యగర్భుడు తామరపువ్వుల సింహాసనం మీద కూర్చుని దీర్ఘముఖుడి కథనం వినేటప్పుడు దాని చుట్టూ దాని మంత్రులన్నీ, సర్వజ్ఞ చక్రవాకంతో సహా, కూర్చుని ఉన్నాయి.

అంతా విని హిరణ్యగర్భుడు దీర్ఘ ముఖుడితో, "నువ్వు యుద్ధం చేస్తామని బెదిరించటంలో తొందరపడ్డావు! నీ దేశం యొక్క బలం నువ్వు పరిగణించలేదు." అన్నది.

"దీర్ఘముఖుడు చాలా మూర్ఖంగా ప్రవర్తించింది. అకారణంగా కలహం తెచ్చి పెట్టింది." అని సర్వజ్ఞుడు హంస రాజుతో ఏకాంతంగా, దీర్ఘముఖుణ్ణి అలా కయ్యం ప్రేరేపించమని మన సైనికాధి కారు లెవరో ప్రోత్సహించి ఉంటారన్నది.

"జరిగిన దాని సంగతి వద్దు. ప్రస్తుతం కర్తవ్యం ఏమిటి, చెప్పు." అన్నది హిరణ్యగర్భుడు.

"మనం జంబూ ద్వీపానికి ఇద్దరు చారులను పంపుదాం. ఒకడు వెళ్ళి అక్కడి పరిస్థితులు గమనించి వస్తాడు. రెండోవాడు మనదూతగా వెళ్ళి, ఆ రాజుకు మన సందేశం అందజేస్తాడు." అన్నది సర్వజ్ఞుడు.

దూతలుగా దీర్ఘముఖుణ్ణి, మరో కొంగనూ పంపి, ఆ ఇద్దరి కుటుంబాలనూ కుదువ ఉంచుకున్నారు.

ఇంతలో చిలక రాయబారి జంబూ ద్వీపం నుంచి వచ్చిచేరినట్టు వార్త తెలిసింది. రాయబారికి విడిది చూపించి, రాజుగారి ఆజ్ఞ అయినప్పుడు సభలో ప్రవేశపెట్టమని ఉత్తరువు జారీ అయింది.

హిరణ్యగర్భుడు ఉత్సాహంగా, "అయితే యుద్ధం వచ్చేస్తున్నదన్న మాట!" అన్నది.

సర్వజ్ఞుడు ఇలా అన్నది:

"దేవా, యుద్ధం వాంఛనీయమైనట్టు ఉత్సాహ పడవద్దు. శత్రువుకు దాసోహం అయి, దేశాన్ని వాళ్ళ పరం చెయ్యటం ఎంత తప్పో, తొందరపడి యుద్ధానికి దిగటం కూడా అంతే తప్పు. మంచి మాటలూ, బహుమానాలూ, బెదరింపులూ, రాజకీయ సంబంధాల తెగతెంపులూ పని చేయని పరిస్థితిలోనే యుద్ధానికి దిగాలి. చావు బతుకుల పోరాటం అనుభవం లేనివాడు తానొక మహావీరుణ్ణి అనుకుంటాడు. యుద్ధం వస్తున్నదంటే జనం ఉత్సాహంగా గంటలు వాయిస్తారు. తమవారు యుద్ధంలో చస్తుంటే చెంపలు వాయించుకుంటూ ఏడుస్తారు. ప్రతి యుద్ధమూ ఏదో ఒకనాటికి శాంతితో అంతం కావలసినదే. అందుచేత శాంతే సహజమైనది. యుద్ధంకన్న శాంతే వాంఛనీయమైనది. అయితే ఇప్పుడు యుద్ధం రానేవచ్చింది గనక, అందుకు తగిన ప్రయత్నాలన్నీ జరగవలసిందే. చిత్రవర్ణుడు బలవంతుడన్నది మనం గుర్తుంచుకోవాలి. నీటిపక్షులకన్న నేలపక్షులు సంఖ్యలోనేగాక, బలంలో కూడా మిన్న అయినవి. మన పరిస్థితి ఎలా ఉన్నదంటే, తిమింగిలం నేల మీద ఏనుగుతో పోరాడుతున్నట్టుగా ఉన్నది. బలవంతుడు ఎదిరించినప్పుడు బుద్ధిమంతుడు తాబేలులాగా వెనక్కు తగ్గుతాడు, కాని అవకాశం దొరికినప్పుడు పగబట్టిన పాములాగా దాడి చేస్తాడు. చిలక రాయబారిని విడిదిగృహంలో విశ్రాంతి తీసుకోనియ్యండి. ఈ లోపల మనం మన కోటను చక్కబెట్టుకుందాం."






## 5

[ఏకాక్షిమాంత్రికుడి కంటబడకుండా సేనాని సమరసేనుడు, తన సైనికులతో అరణ్యంలో కొంత దూరంపోయాడు. అక్కడ దాహం తీర్చుకునేందుకు నీటిమడుగులో దిగిన సైనికు లిద్దరిని మొసళ్ళు కబళించినై. మరి కొంత దూరం పోగా, వాళ్ళకు ఒక సరస్సులో స్నానం చేస్తున్న చతుర్నేత్రు డనే భయంకర మాంత్రికుడు కనిపించాడు. తరవాత—]

సరస్సు తీరానవున్న పొదలమాటున దాగివున్న సమరసేనుడికీ, సైనికులకూ, యిప్పుడు సరస్సులో ఒక మనిషి నిలబడివున్నట్టు స్పష్టంగా కనబడింది. అతడు ఒక కుచ్చులటోపీ ధరించివున్నాడు. ఆ టోపీకి ముందు భాగాన నేత్రాలవంటి రెండు గుర్తులున్నవి. వాటిల్లో నుంచి కళ్ళను మిరుమిట్లు కొల్పేకాంతి ఒకటి బయిటికి ప్రసరిస్తున్నది.

ఆ సరికి సమరసేనుడి సంశయాలన్నీ తీరిపోయినై. ఈ మనిషి ఏకాక్షిమాంత్రికుడి బద్ధ శత్రువైన చతుర్నేత్రు డని అతడు గ్రహించాడు. బ్రహ్మాండమైన శరీరమూ, సన్నటి తలా గల వింత జంతువు తనను మింగజూచినప్పుడు, వాడేమాత్రం భయపడక, "చతుర్నేత్రుణ్ణే మింగటానికి వచ్చావా?" అంటూ హుంకరించాడు. వింతజంతువు పారిపోయింది.



వీడు మహాశక్తి మంతుడై వుండవచ్చను కున్నాడు, సమరసేనుడు.

ఇప్పుడు సరస్సుతీరం నుంచి, యీ భయంకర మాంత్రికుడి కంట బడకుండా తప్పించుకోవటం ఎలా? అన్న ఆలో చనలో పడ్డాడు, సమరసేనుడు. అంతలో ఒక సైనికుడు, "సేనానీ, మనలాగా రెండు కన్నులు కాకుండా, వీడికి నాలుగు కన్నులున్నట్టున్నదే!" అన్నాడు.

సమరసేనుడు జవాబివ్వబోయేంతలో మరొక సైనికుడు, మొదటివాడి కేసి కోపంగా చూస్తూ, "వాడికి నాలుగు కళ్ళున్నట్టు తెలుస్తూనే వున్నది గదా? వాడి పేరే చతుర్నేత్రుడాయె," అన్నాడు.

సమరసేనుడు, సైనికుల మాటలు ఒక పక్క వింటూనే, ముందు కర్తవ్యం గురించి ఆలోచించసాగాడు. కొంచెం సేపు తరవాత అతడు సైనికుల కేసి తల తిప్పి, "ఇప్పటి మన విషమస్థితి మీరే పాటి గ్రహించారో తెలుసుకునేందుకు అడుగుతున్నాను. మనం లోగడచూసిన ఏకాక్షిమాంత్రికుడూ, యీ చతుర్నేత్రుడూ బద్ధవైరులే కదా?" అన్నాడు.

ఈ ప్రశ్నకు సైనికులలో ఒకడు తప్ప, మిగతా అందరూ అవునంటూ తలలు వూపారు. అనుమానం తీరని సైనికుడు, సమరసేనుడితో, "సేనానీ! మీరు మరోలా అనుకోకపోతే, ఒక చిన్న సంశయం తీర్చుకోవాలని వున్నది." అన్నాడు.

"ఏమిటా సంశయం? నువ్వేకాదు, మిగతావాళ్లు కూడా వాళ్ళక్కలిగిన సంశయాలగురించి అడగవచ్చు. ఇలాంటి ఆపదసమయంలో, ఒక్కడి మాట మీద పోవటం కన్న, అందరం కలిసి ఆలో చించి, ఒక నిర్ణయానికి రావటమే శ్రేయ స్కరం," అన్నాడు సమరసేనుడు.

"సేనానీ, తమరు ఏకాక్షి మాంత్రికు డికీ, చతుర్నేత్రుడికీ మధ్యగల వైరాన్ని మనకు అనుకూలంగా వినియోగించు కుందామని ఆలోచిస్తున్నారా? అలా అయితే, నా దొక చిన్న సలహా. సింహానికీ,

పెద్దపులికీ శత్రుత్వమే. కాని, అవి రెండూ క్రూరమృగాలే అన్నసంగతి మనం మరిచిపోగూడదు గదా?'' అన్నాడు సైనికుడు.

సైనికుడు అన్నమాటలతో సమరసేనుడు తిరిగి ఆలోచనలో పడ్డాడు. అతడు కొంచెం ఆగి, సైనికుడితో, "నీమాట నిజమే! వీళ్ళిద్దరూ మహా మంత్రవేత్తలు, దుష్టశక్తులనన్నిటినీ తమ అదుపాజ్ఞలలో పెట్టుకున్నవాళ్ళు....'' అంటూండగానే, సరస్సులో నుంచి చతుర్నేత్రుడు ఒడ్డుకు వచ్చాడు.

చతుర్నేత్రుడి నిలువెత్తు భయంకర రూపం చూసి, సమరసేనుడూ, సైనికులూ కంపించిపోయారు. వాళ్లు పారిపోదామని వున్నచోటునుంచి కదిలేంతలో, చతుర్నేత్రుడి కంచుకంఠం, అరణ్యవృక్షాలలో మారుమోగింది, ''ఓరీ, పిచ్చివాళ్ళలారా! నాకే కనుగప్పుదామని చూస్తున్నారా? ఊహుఁ, అది మీ వల్లకాదు.. ఈ చెట్టు చేమలూ, కొండలూ, గుట్టలూ ఏవీ నా దృష్టిని ఆటంకపరచలేవు. దేనినైనా ఛేదించుకుపోతుంది, నా చూపు! ఈ ద్వీపంలో ఏమూల ఏం జరుగుతున్నదో, ఏ క్షణంలోనైనా చెప్పగలను. ఏయ్ఁ, ఉలూకా! నరవానరా!'' అంటూ కేక వేశాడు.








అ కేకకు నల్లగూబా, నరవానరమూ చెట్ల వెనకనుంచి వేగంగా వచ్చి సమర సేనుడి దారికి అడ్డంగా నిలబడినై. నర వానరం చేతిలో ఒక చెట్టుకొమ్మ పట్టు కుని ఝళిపించసాగింది. నల్లగూబ గాలిలో ఎగురుతూ కర్ణకఠోరంగా అరవ సాగింది.

సమరసేనుడికి తానున్న విషమస్థితి అర్థమైపోయింది. తమచేతనున్న కత్తులూ, విల్లంబులూ పూచిక పుల్లకైనా కొరగావు. అందుచేత సైనికుల భీతినిపోగొట్టేందుకు, "మన దేవి వుండగా, మన కేం ప్రమాదం కలగదు. అన్నిటికీ ఆ కుండలినీదేవే శరణ్యం!" అన్నాడతను.

సైనికులు నివ్వెరపోతూ నిలబడి వున్నారు. చతుర్నేత్రుడు మెల్లగా ఒక్కొక్క అడుగేవేస్తూ, వాళ్ళను సమీపించి, మృదువైన కంఠస్వరంతో, "ఎవరు మీరు? ఈ ద్వీపానికి ఎందుకొచ్చారు?" అని అడిగాడు.

ఆ సమయంలో చతుర్నేత్రుడి ముఖాన ఈర్ష్యగాని, కాఠిన్యంగాని మచ్చుకైనా కనిపించలేదు.

చతుర్నేత్రుడి మాటతీరు చూసి సమర సేనుడికీ, సైనికులకూ ప్రాణం కుదుట పడింది. అయితే, అతడి ప్రశ్నకు ఎలాంటి జవాబివ్వటం తమకు క్షేమం అన్న ప్రశ్న ఎదురైంది, సమరసేనుడికి. నిజం చెప్పటమే మేలని అతడికి తోచింది. చతుర్నేత్రుడి నుంచి దాచగలిగింది ఏమీ లేదని తెలుస్తూనేవున్నది.

"మాది కుండలినీ ద్వీపం. సముద్రం మీద తుఫానులో చిక్కి, యిక్కడికి చేరాము," అన్నాడు సమరసేనుడు.

చతుర్నేత్రుడు నవ్వి, "నువ్వు చెప్పిన దాంట్లో నిజం లేకపోలేదు. కాని, సముద్ర యానం ఎందుకు చేయవలసి వచ్చిందో, ఆ సంగతి మాత్రం దాచావు, అవునా?" అన్నాడు.

సమరసేనుడు యిక అసలు సంగతి దాచి లాభంలేదనుకుని, తమ రాజుగారి

ధనాగారం వట్టిపోవటంతో, దానిని మళ్ళీ నింపే ప్రయత్నంలో సైనికులను తీసుకొని బయలు దేరానని చెప్పాడు.

చతుర్నేత్రుడు చిరునవ్వు నవ్వుతూ అంతా విని, "ఆహాఁ, ధనంకోసం బయలుదేరి, దురదృష్టవశాత్తు తుఫానులో చిక్కుకుని, యీ మంత్రాలదీవి చేరావన్నమాట! బాగానేవున్నది. కాని యిక్కడా ఒక మాంత్రికుడున్నాడు. అతడికీ చెప్పరానంత ధనాశ. ధనాశాపరులైన మీ యిద్దరూ ఏకమైతే బావుంటుందిగదా?" అన్నాడు.

ఏమి అనేందుకూ సమరసేనుడికి పాలుపోలేదు. అతను అలా తటపటాయిస్తున్నంతలో, ఆ ప్రాంతమంతా ప్రతిధ్వనించేలా ఒక పెద్ద కంఠస్వరం వినబడింది. ఆ సర్వం ఏకాక్షిమాంత్రికుడిది. అతడు బిగ్గరగా, "హేయ్, కాలభుజంగా! కపాలా! రండి, వెతకండి!" అంటున్నాడు.

ఆ కేకలు విని వణికిపోతున్న సైనికులకు, సమరసేనుడు ధైర్యం చెబుతూ, "భయపడి లాభంలేదు. అదుగో, ఆ కనబడే పొదల వెనకదాక్కోండి!" అని హెచ్చరించాడు.

సైనికులు పొదలకేసి పరిగెత్తారు. అంతలో ఏకాక్షిమాంత్రికుడు అక్కడికొచ్చాడు. కాలసర్పమూ, మానవకపా




లమూ అతడి పక్కనే కదులుతున్నాయి. చతుర్నేత్రుడు కంట బడగానే, అతడు ప్రళయభీకరంగా హుంకరించి, "ఎన్నాళ్లకెన్నాళ్ళకు కనిపించావు!" అంటూ చర్రున ఒరనుంచి కత్తి దూశాడు.

చతుర్నేత్రుడు కన్నార్పకుండా, ఏకాక్షిమాంత్రికుడి కేసి చూస్తూ, ఉన్నచోటునే నిలబడి, "ఓహో, ఏకాక్షులవారా? దయచేయండి, దయచేయండి," అన్నాడు వికటంగా నవ్వుతూ.

ఏకాక్షిమాంత్రికుడు ఏదో అనబోయేంతలో, చతుర్నేత్రుడు పెద్దగా, "నరవానరా! ఉలూకా!" అని కేక పెట్టాడు. ఆ వెంటనే నల్లగూబా, నరవానరమూ

అక్కడికి వచ్చినై. వాటిని చూసి ఏకాక్షి మాంత్రికుడు గతుక్కుమన్నాడు

ఏకాక్షి భయపడటం గమనించిన చతుర్నేత్రుడు, "ఉలూకా! ఈ దుష్టుడి కుడి కంటి రుచి నువ్వెరిగినదే! ఇప్పుడు ఎడమకంటిని కూడా పొడిచి రుచి ఎలా వున్నదో చూడు!" అన్నాడు.

ఆ మరుక్షణం నల్లగూబ ఏకాక్షి మాంత్రికుడి కేసి ఎగిరింది. ఏకాక్షి కంగారుపడుతూ, "కపాలా! కపాలా!" అంటూ అరవసాగాడు.

ఆ వెంటనే మనిషి కపాలం తన బోసి నోటిని కదిలిస్తూ ముందుకువచ్చి, నల్ల గూబ పైకి ఉరికింది.

ఏకాక్షిమాంత్రికుడు ఉత్సాహం పట్ట లేక పెద్దగా నవ్వసాగాడు. అది చూసి చతుర్నేత్రుడు ఉగ్రుడైపోతూ, "నర వానరా!" అంటూ అరిచాడు. మరు నిమిషంలోనే నరవానరం, ఏకాక్షిమాంత్రి కుడి కేసి దూకింది. ఏకాక్షి, "కాల భుజంగా!" అంటూ భీతితో కేకపెట్టాడు. వెంటనే కాలసర్పం బుసలుకొడుతూ వచ్చి, నరవానరంతో కలియబడింది.

సమరసేనుడూ, సైనికులూ పొదల చాటునవుండి, ఈభయంకరపోరాటాన్ని చూడసాగారు. "ఇదీ, సమానమైన ఉజ్జీలంటే!" అన్నాడొక సైనికుడు.




"అందువల్లనే మనం, మాంత్రికులలో ఏ ఒక్కడి పాలా బడకుండా బతికి పోయాం," అన్నాడు సమరసేనుడు.

ఏకాక్షిమాంత్రికుడి భృత్యులూ, చతుర్నేత్రుడి వేగులకూ మధ్య గొప్పయుద్ధం సాగింది. నల్లగూబను, మానవకపాలం తన బోసినోటితో వడిసి పట్టబోయింది. నరవానరం శరీరాన్ని పెనవేయాలని కాల భుజంగం తీవ్రంగా పెనుగులాడుతున్నది

దూరంగా నిలబడివున్న చతుర్నేత్రుడూ, ఏకాక్షిమాంత్రికుడూ ఒకళ్ళ నొకళ్లు కోపంగా పళ్లు కొరుకుతూ చూసుకోసాగారు. తమ బంట్ల పోరాటం యింతలో తేదికాదని, ఇద్దరికీ తెలుసు.

హఠాత్తుగా చతుర్నేత్రుడు నవ్వి, తల మీది టోపీ పైకెత్తి, పెద్దగా, ''ఓం— హ్రీం,'' అన్నాడు. అలా అనీ అనటంతోనే అతడు అదృశ్యమైపోయాడు. ఆ వెంటనే నల్లగూబా, నరవానరం మాయమైనాయి.

ఏకాక్షిమాంత్రికుడు గంభీరంగా ముఖంపెట్టి, "ఔరా, పిరికిపందా! అదృశ్యమయ్యావా? కానీ, ఎంతకాలం యిలా తప్పించుకు తిరుగ్గుతావో చూస్తాను,'' అంటూ ఛీత్కరించాడు.

ఒకటి, రెండు క్షణాలపాటు ఏకాక్షి మాంత్రికుడు ఏదో ఆలోచిస్తూ వూరుకుని, సమరసేనుడూ, సైనికుల కోసం చుట్టూ కలయచూశాడు. పొదలచాటున దాగి వున్న వాళ్లు, అతడి కంటబడలేదు. గట్టిగా ఓమారు పళ్ళు కొరికి, చతుర్నేత్రుడి వేగులతో పోరాడి అలిసిపోయిన కాల భుజంగాన్నీ, కపాలాన్నీ మెచ్చుకున్నాడు. తళతళ మెరుస్తున్న చేతిలోని పెద్ద కత్తిని ఝుళిపిస్తూ, చెట్ల కొమ్మల కేసి చూశాడు. అతడికి యింకా నల్లగూబ అంటే భయం పోలేదు. అది పూర్వం ఒకసారి అతడి కంటిని, తన వాడి ముక్కుతో పొడిచింది. దాని అరుపు వింటేనే మాంత్రికుడికి ముచ్చెమట్లు పోస్తాయి.

తరవాత ఏకాక్షిమాంత్రిడు కపాలాన్నీ కాలభుజంగాన్నీ వెంటబెట్టుకుని, అక్కడి నుంచి వెళ్లిపోయాడు. సమరసేనుడూ, సైనికులూ పొదలచాటు నుంచి బయటికి వచ్చారు.

సమరసేనుడు తిరిగి సైనికులను వెంట బెట్టుకుని, తూర్పు తీరాన వున్న తమ ఓడలను చేరేందుకు నాలుగైదడుగులు వేసేంతలో, భూమి పెద్దగా దద్దరిల్లింది. ఆ వెంటనే ఫెళఫెళమంటూ భయంకరంగా శబ్దమైంది. సమరసేనుడూ, సైనికులూ నిర్విణ్ణులైపోయారు. అంతలో వారికి దాపులనున్న అగ్ని పర్వతం నుంచి పెద్దపెద్ద జ్వాలలు లేచి, నల్లనిపొగలతో ఆకాశాన్ని కప్పివేయసాగినై. అందరూ వణికిపోతూ, ఆ జ్వాలల కేసి చూడసాగారు. —(ఇంకావుంది)





# నోటిదురుసు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి, భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడ. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, నిస్సందేహంగా నీ స్వభావం అచంచలమైనది. కాని అలాంటి స్వభావం కూడా అతీత శక్తుల ప్రభావానికి గురి అయినప్పుడు పూర్తిగా మారిపోతుంది. ఇందుకు నిదర్శనంగా నీకు వీరకేసరి అనే వాడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు

వీరకేసరి అనేవాడు ఒక సాధారణ వ్యక్తి. అయితే వాడిలో అసాధారణమైన గుణం ఏమంటే, నోటిదురుసు. వాడు కనిపించిన ప్రతిమనిషినీ ఏదో ఒకటి అనకుండా ఉండలేక పోయేవాడు. అందు చేత గ్రామంలో ఎవరికీ వాడి పొడగిట్టే ..

## బేతాళ కథలు



కాదు. అందరూ వాణ్ణి బాగా ఏవగించుకునే వారు.

వాడి భార్య ఎంతో సాత్వికురాలు. వాడిచేత మాటలు పడటం ఎవరికి తప్పినా ఆమెకు తప్పేది కాదు. భర్త ఎన్ని మాటలు అన్నా ఆమె పడి ఊరుకునేదే గాని, ఎదురు చెప్పేది కాదు. ఇది చూసి ఆమె అన్న అయిన సాంబశివుడు చాలా బాధపడేవాడు. తన బావమరిదికి బుద్ధి వచ్చేటట్టు చెయ్యాలని అతను వాళ్ళ గ్రామానికి దూరప్రాంతం నుంచి ఒక మల్లుణ్ణి రప్పించాడు.

ఆ మల్లుడు గ్రామంలో బలప్రదర్శనం చేసి, "నాతో మల్లయుద్ధం చేయగలవాడు గ్రామంలో ఎవరైనా ఉంటే చూడాలని ఉన్నది!" అన్నాడు.

ప్రేక్షకుల మధ్య ఉన్న వీరకేసరి, "ఇక్కడ మల్లు లెవరూ లేరని ముందు తెలిసే ప్రగల్భాలు పలుకుతున్నావు!" అన్నాడు.

మల్లుడికి చప్పున ఆగ్రహం వచ్చి, "ఆ మాట అన్నవాడు నా ఎదటికి వచ్చి అన్నట్టుంటే వాడిప్రాణం తీసి ఉందును!" అన్నాడు.

వీరకేసరి ముందుకు వచ్చి, "ఏం? భయమనుకున్నావా? ఉన్నమాటే గదా అన్నాను?" అన్నాడు.

మల్లుడు వీరకేసరిని చావ చితకగొట్టి, కొనప్రాణంతో వదిలేశాడు.

తరవాత వాడి బావమరిది సాంబశివుడు వాడితో, "నీ నోటిదురుసు, చూడు, నీకు ఎంత కష్టం తెచ్చిందో!" అని బుద్ధి చెప్పబోయాడు.

"దెబ్బలు తింటే నేం? అంత పెద్ద మల్లుడి ముందు నిలబడి మాట్లాడగల ధైర్యశాలి నేనుతప్ప మనఊళ్లో మరొకడు లేకపోయాడే!" అన్నాడు వీరడు.

వాడి స్వభావం చచ్చినా మారేది కాదని వీరడి బావమరిది నిశ్చయించుకుని, వాణ్ణి మార్చేప్రయత్నం నుంచి విరమించుకున్నాడు.

ఒకనాడు వీరడు ఇంట లేని సమయంలో ఒక యతి వారి ఇంటికి వచ్చాడు. వీరడి భార్య ఆయనతో, "స్వామీ, తమ వంటి వారికి ఆతిథ్యం ఇయ్యాలని నా ప్రాణం ఎంతో తల్లడిల్లుతుంది. కాని నా భర్త నోటికి భయపడి నేను ఏమీ చేయలేను!" అన్నది.

"అమ్మా, నాకు భోజనం పెట్టు. నీ భర్త నోటిని నేను సంస్కరిస్తాను!" అన్నాడు యతి. ఆయనమాటలో విశ్వాసం ఉంచి ఆ ఇల్లాలు యతికి భోజనం పెట్టింది.

యతి భోజనం చేస్తూండగా వీరడు ఇంటికి చేరి, యతిని చూస్తూనే, "తిండి కోసం గడ్డమూ మీసాలూ పెంచుకోకపోతే, ఒళ్ళు వంచి పనిచేసుకుని బ్రతకరాదా ?" అని తిట్టాడు.

"నేను మహిమగల వాణ్ణి! నన్ను తిట్టడం నీకు క్షేమంకాదు!" అన్నాడు యతి వీరడితో.

"నీ మహిమకు నేను భయపడనురా చింపి గుడ్డల సన్యాసీ!" అన్నాడు వీరడు, ఒళ్ళు తెలియని కోపంలో పళ్ళు కొరుకుతూ.

మరుక్షణం యతి ఒంటి మీది చింపి గుడ్డలు మాయమై రాచ ఉడుపులు వచ్చాయి. అది చూసి వీరడు నిర్ఘాంతపోయాడు.

"ఈ క్షణం నుంచీ నువు ఎవరిని తిట్టినా అది వాళ్ళకు వరంగా మారు





తుంది!'' అని చెప్పి, యతి లేచి వెళ్ళిపోయాడు.

అది మొదలు చాలా చిత్రాలు జరిగాయి. వీరడు నోటితీట కొద్దీ ఎవరినైనా, ''నీ పంట నాశనం కానూ!'' అంటే వాళ్ళ పంట రెట్టింపు అయేది; అలాగే ఎవరినైనా, "నీ ఇల్లుకూలిపోనూ!" అని తిట్టితే వాళ్ల ఇంటి మీద మరొక అంతస్థులేచేది!

ఊళ్ళో వాళ్ళకు వాడంటే లక్ష్యం ఏమీలేకుండా పోయింది.

చిత్రంగా వీరడిలో ఏదో మార్పుకలగసాగింది. వాడు తన ఆగ్రహాన్ని అప్పుడప్పుడూ అదుపులో పెట్టుకుని, తనకు ఎవరి మీదనైనా కోపం వచ్చినప్పుడు వాళ్ళను దీవించసాగాడు. కాని ఆ దీవనలకు విరుద్ధంగా వాళ్ళు నష్టపోవటం జరగలేదు.

అలాగే తాను తనకు ఇష్టమైన వాళ్లను పని పెట్టుకుని రకరకాలుగా తిట్టి, ఆ విధంగా వాళ్ళకు లాభం కలిగించజూశాడు. కాని అందువల్ల వాళ్ళకు లాభం జరగలేదు.

అయినా వాడు నోటిదురుసుకొద్దీ ఎవరినైనా తిట్టినప్పుడు మాత్రం దానికి విరుద్ధంగా అవతలి వాళ్ళకు లాభం జరుగుతూనే ఉన్నది. క్రమంగా వీరడి నోటిదురుసు హరించుకుపోయింది. వాడు అర్థమైన వాళ్ళనూ అనవసరంగానే గాక, కోపం వచ్చినప్పుడు కూడా, తిట్టడం మానేసి, అందరితోనూ ఎంతో మంచిగా ఉండసాగాడు. అందరికన్నా వాడి భార్య వాడిలో మార్పువల్ల ఎక్కువ సుఖపడిపోయింది.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, వీరకేసరిలో యతి మార్పు తెచ్చినట్టు స్పష్టమవుతున్నది. కాని అందుకోసం యతి చేసినది ఏమీలేదు; వాడి తిట్టు దీవన అయేలాగ చేశాడు. అంతమాత్రాన మనిషిలో చిన్నతనం నుంచీ ఉన్న తొందరపాటూ, నోటిదురుసూ, ఒళ్ళు

తెలీని ఆగ్రహమూ ఎలా పోతాయి? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగులుతుంది." అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "ఏ మనిషి అయినా ఇతరులను తిట్టేది తిట్టు తగలాలనే! అది నిజం కావాలనే! కొందరు మహాత్ములకు నోటిమాట అక్షరాలా నిజమయేదని పురాణాలు కూడా చెబుతున్నాయి. కాని మామూలు మనుషులకు ఆ శక్తి ఏనాడో పోయింది. అందుచేత నోటిదురుసు కొందరిలో ఎక్కువ కూడా అయింది. తమ నోటిమాట జరగదన్న నమ్మకంతో కోపిష్ఠి వాళ్లు నోరు అమితంగా పారేసుకుంటారు. అలాటి.వాళ్ళకు ఆత్మసంతృప్తి ఎలా కలుగుతుందంటే, ఇతరులు తమ నోటికి వెరవటం నుంచి! వీరడి విషయంలో యతి చేసినది ప్రధానంగా, వాడి తిట్టుకు జనం భయపడకుండా చెయ్యటం! తన తిట్లకు విరుద్ధ ఫలితాలు కలగడం ఆరంభమయాక వీరడు నలుగురికీ ఏవగింపు కలిగించకపోగా అందరికీ అలుసు అయిపోయాడు. ఎవరూ వాణ్ణి లక్ష్యపెట్టలేదు. ఆ స్థితిలో వాడు ఇతరుల దృష్టిలో గొప్పగా కనబడటానికి, తాను మేలు చేయదలచిన వాళ్లను తిట్టాడు; తాను కీడుచేయదలచిన వాళ్లను దీవించాడు. ఈ ఎత్తు సహజంగా పారలేదు. ఎందుకంటే, వాడి తిట్టు దీవన కావటానికి కారణం యతి మహత్తు. దాన్ని తన మహత్తు చేసుకునేటందుకు వీరడు ఇష్టమైన వారిని తిట్టాడు, ఇష్టంలేని వారిని దీవించాడు, భంగపడ్డాడు. ఆ విధంగా వీరడి నోటిదురుసు వాడికి ఎందుకూ పనికిరాకుండా పోయి, వాణ్ణి అందరికీ దూరం చేసింది. ఆ తరవాత వాడు మామూలు మనిషి కావటానికి ప్రత్యేకమైన కారణం అవసరం లేకపోయింది." అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతోసహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)



# బాధ్యులు

ఒక గ్రామంలో నీటిఎద్దడి సంభవించింది. చెరువుకు పూడిక తీయించి, నీటివసరులు కల్పిస్తే గ్రామస్థుల నీటికొరత తీరుతుందని రాజుగారికి నివేదిక వెళ్ళింది.

చెరువు పని చేయించమని రాజుగారు ఉత్తరువులు జారీచేశారు. మంత్రి రాజప్రతినిధికి తాఖీదు పంపాడు. రాజప్రతినిధి వ్యవసాయశాఖవారిని ఆదేశించాడు. చివరకు రాజాజ్ఞ గ్రామాధికారికి చేరింది.

త్వరలోనే పని పూర్తి అయింది. చెరువు మరమ్మతు, నీటినిలవ వగైరాలు తనిఖీ చెయ్యటానికి రాజు స్వయంగా ఆ గ్రామానికి వెళ్ళి రాజధానికి తిరిగివచ్చి, మంత్రితో, "చెరువు మరమ్మతుల విషయంలో చాలా అవకతవకలు జరిగాయి. ఎవరు బాధ్యులు?" అని అడిగాడు.

మంత్రి గజగజలాడిపోయి, రాజప్రతినిధిని సంజాయిషీ అడిగాడు. రాజప్రతినిధి తప్పును వ్యవసాయశాఖ మీద తోశాడు. ఎవరూ తప్పు తమది కాదన్నారు. చివరకు అందరూ కలిసి గ్రామాధికారి మీద తోశారు.

రాజు గ్రామాధికారిని పిలిపించి, అతన్ని ఘనంగా సత్కరిస్తూ, "పని ఎలా జరిగినదీ మంత్రి మొదలుకుని ఒక్కరూ ఎరగరు. బాగా జరిగినదంటే తమ ప్రజ్ఞే అని అందరూ ముందుకు వస్తారు. తప్పు జరిగిందనగానే అందరూ ఇతరుల మీదికి తోసేవారే!" అన్నాడు.

—"వైదేహి"





# కష్టనష్టాలు

రామనాథుడు ఆ ఊళ్లో మోతుబరి రైతు. అతని ఏక పుత్రుడు సోమనాథుడు పెద్ద చదువులు చదివి, ఇంటికి తిరిగి వచ్చాడు. వ్యవసాయం తన కొడుక్కు అప్పగించి తాను విశ్రాంతి తీసుకుందామనుకున్నాడు రామనాథుడు.

కాని సోమనాథుడికి వ్యవసాయం చేయాలని లేదు. అతను తన తండ్రితో, ''వ్యవసాయం అంత లాభసాటి కాదు. కష్టపడినందుకు తగిన ఫలితం ఉంటుందనుకోవటానికి వీలులేదు. అతివృష్టి, అనావృష్టి ఏర్పడి శ్రమ అంతా బూడిద పాలు కావచ్చు.'' అన్నాడు.

కొడుకు మాటలకు నివ్వెరపోయి రామనాథుడు, ''అయితే ఏం చేయాలని నీ ఉద్దేశం?'' అని అడిగాడు.

సోమనాథుడు ఆ ఊళ్ళోనే లక్షల మీద వ్యాపారం చేస్తున్న ఒక ప్రముఖుణ్ణి కలుసుకుని, ''ఏ విధమైన వ్యాపారం లాభసాటిగా ఉంటుందంటారు?'' అని అడిగాడు.

వ్యాపారి నిట్టూర్చి, ''ఏం వ్యాపారం, నాయనా? చదువుకున్న వాడివి. చూస్తూ, చూస్తూ, ఈ రొంపిలో ఎందుకు దిగుతావు? వ్యాపారం వెనకటి అంత లాభసాటిగా ఉండటం లేదు. వ్యాపారస్థులు జాస్తి అయారు, పోటీ హెచ్చింది. వ్యాపారం చేసుకునే వాడికి సుఖం లేదు, శాంతిలేదు.'' అన్నాడు.

వ్యాపారంలోగల కష్టనష్టాలను గురించి వివరంగా విన్నాక సోమనాథుడికి వ్యాపారం మీద విముఖత్వం పుట్టింది.

అతను అక్కడి నుండి తిన్నగా నగరానికి వెళ్ళి, అక్కడ ఉన్న ఒక ప్రముఖ రాజోద్యోగిని కలుసుకుని, తన విషయమంతా చెప్పి, రాజుగారి కొలువులో

గంగిశెట్టి శివకుమార్

తనకు ఏదన్నా ఉద్యోగం ఇప్పించ మన్నాడు.

రాజోద్యోగి ఇలా చెప్పాడు:

''ఎందుకు, నాయనా, రాజుగారి కొలువు చేస్తానంటావు? రాజుగారి దివాణంలో ఉద్యోగం చెయ్యటమంటే కత్తిమీద సామే! రాజుగారికి అనుగ్రహం కలిగినా, ఆగ్రహం కలిగినా మనకు ప్రమాదమే. ఆత్మాభిమానం చంపుకుని నౌకరీ చెయ్యాలి. ఎంత చేస్తే మాత్రం ఊరా? పేరా? చదువుకున్నావు; తెలివి తేటలున్నాయి: భూములున్నాయంటు న్నావు! నీ తెలివితేటలు వ్యవసాయంలో చూపావంటే, నువ్వింత తిని, పదిమందికి ఇంత పెట్ట గలుగుతావు. ఉద్యోగాల బతుకులు చాలీ చాలని బతుకులు! గాడిద బతుకులు! ఇంతాచేసి ఉద్యోగం దొరకటమంటే మాటలుకాదు!''

రాజోద్యోగి చెప్పిన మాటల్లో నిజం ఉన్నదని సోమనాధుడికి తోచింది. అతను ఇంటికి తిరిగి వచ్చాడు.

ముఖం వేలాడ వేసుకుని వచ్చిన కొడుకును చూసి రామనాధుడు, విషయం అడిగి తెలుసుకుని, ఇలా అన్నాడు:

''నువు ఒక్క వ్యవసాయంలోనే కష్ట నష్టాలు ఉన్నాయనుకున్నావు. అది నీ తప్పుకాదు. నీకు వ్యవసాయం గురించి మాత్రమే అనుభవం ఉన్నది. వాస్తవం ఏమంటే, ఎక్కడ లాభమనేది ఉంటుందో అక్కడే అంతో, ఇంతో నష్టంకూడా ఉంటుంది. అలాగే సుఖం ఉండే చోటనే ఎంతో కొంత కష్టంకూడా ఉంటుంది. పూర్తి సుఖంతోకూడి, అచ్చగా లాభమే ఇచ్చే పని ఎక్కడా ఉండదు. జీవితంలో కష్టనష్టాలు అడుగడుగునా ఉంటాయి. మనిషికి కావలసినది దీక్ష, ఆత్మస్థైర్యమూనూ! ఇవి ఉంటే ఎక్కడ కష్టనష్టాలు కలిగినా వాటిని ఎదుర్కొని జయించవచ్చు.''

సోమనాధుడి మనసు తండ్రి మాటలతో దృఢపడింది. అతను వ్యవసాయమే చేపట్టి, సమర్థుడనిపించుకున్నాడు.



# జ్ఞానోదయం

కేశవుడి తండ్రి తనకున్నదంతా తెగనమ్మి, ఉన్నతవిద్య చెప్పించి, రాజుగారి దివాణంలో పెద్ద ఉద్యోగం సంపాదించుకునేటట్టు చేశాడు. కేశవుడు దివాణంలో ఉన్నత పదవి సంపాదించటమే గాక, నాగరికమైన కుటుంబానికి చెందిన రాణి అనే పిల్లను పెళ్ళాడి, పూర్తిగా మారిపోయి, తల్లిదండ్రులను గురించి ఆలోచించటమే మానేశాడు.

కాలక్రమాన కేశవుడికి కొడుకు కలిగాడు. వాడు పెరిగి పెద్దవాడవుతూంటే, రాణి వాడికి కూడా దివాణంలో చిన్న ఉద్యోగం చూడమన్నది.

"అప్పుడే ఉద్యోగానికి ఏం తొందర? వాణ్ణి పెద్ద చదువులు చదవనీ," అన్నాడు కేశవుడు.

"ఇంకా పెద్ద చదువులు చదివితే వాడు మన ముఖం చూస్తాడా? పెద్ద ఉద్యోగం సంపాదించి, పెద్ద కుటుంబంలో దాన్ని పెళ్ళాడి మన ముఖాన మొద్దులు కూడా పెట్టడు!" అన్నది రాణి.

కేశవుడికి జ్ఞానోదయమయింది. మర్నాడే అతను తన ముసలి తల్లిదండ్రులను తెచ్చి, ఇంట్లో పెట్టుకుని, బతికినన్నాళ్ళూ వారికి ఏ లోటూ లేకుండా చూశాడు.

— ఎం. బాషా మొహిద్దీన్





# నిజాయితీ విలువ

చెంగయ్య నగలదుకాణంలో భద్రయ్య గుమాస్తాగా పని చేస్తున్నాడు. అతని జీతం డబ్బులతో అతని కుటుంబం సుఖంగానే జరుగుతున్నది. భద్రయ్య నిజాయితీపరుడు.

భద్రయ్య కూతురుకి పెళ్ళి ఈడు వచ్చింది. పెళ్ళి ఖర్చుకు కనీసం వెయ్యి కావాలి. భద్రయ్య తన షావుకారును అప్పు అడిగాడు. కాని షావుకారు వ్యాపారపు చిక్కులు సాకు చెప్పి, అప్పు ఇయ్యలేననేశాడు.

ఒకనాడు తారాచంద్ అనే ప్రసిద్ధ వడ్డీవ్యాపారి వజ్రాలహారాలు కొనటానికి చెంగయ్య నగలదుకాణానికి వచ్చాడు. అది పనివాళ్ళంతా భోజనాలకు వెళ్ళిన సమయం. భద్రయ్య లెక్కలు రాయటం పూర్తి చేసి, కొట్టు కట్టేద్దామనుకుంటున్న సమయంలో తారాచంద్ వచ్చాడు.

తారాచంద్ తనకు కావలసిన హారాలు తీసుకుని, వాటిమీద తన పేరు చెక్కించుకుని, భద్రయ్యకు డబ్బు ఇచ్చి, వెళ్ళిపోయాడు.

భద్రయ్య తన పని పూర్తి చేసుకుని లేచి, కొట్టుమూసే ప్రయత్నంలో ఉండగా, చిన్న సంచీ నేలమీద కనిపించింది. దాన్ని విప్పి చూస్తే అందులో తారాచంద్ కొన్న హారాలున్నాయి. వాటిని చూడగానే భద్రయ్యకు తన కూతురి పెళ్ళి జ్ఞాపకం వచ్చింది. వాటిని అమ్మితే కూతురు పెళ్ళికి కావలసిన డబ్బు చేతికి వస్తుంది.

ఇన్నాళ్ళూ నిజాయితీగా బతికిన భద్రయ్య ఒకంతట దురాలోచనకు లొంగలేకపోయాడు. కాని అవసరమూ, అవకాశమూ కలిసివచ్చి, అతని నీతిని చెడగొట్టాయి. అతను ఆ హారాలను తీసుకుని పెద్ద బజారుకు వెళ్ళాడు. హారాలను

షేక్ గాలిబ్

కంసాలి కొమరయ్యకు అంటగట్టి డబ్బు తీసుకుందామని భద్రయ్య ఉద్దేశం. కొమరయ్య దొంగ నగలను కొంటాడు.

పెద్ద బజారులో ఇసకవేస్తే రాలనంత రద్దీగా ఉన్నది. జనాన్ని తోసుకుంటూ కొమరయ్య ఇంటికి చేరి రొండిన తడువు కుంటే, సంచీలేదు. భద్రయ్య గుండె గుభేలుమన్నది. ఆ సంచీలో హారాలతో బాటు అతని నెల జీతం కూడా ఉన్నది!

ఆశతీరక, భద్రయ్య తాను వెళ్ళిన దారి పొడుగునా వెతుకుతూ, నగల దుకాణం దాకా వచ్చి, కొట్లో నన్నా పోయిన సంచీ దొరకవచ్చునని మూఢంగా నమ్ముతూ, దుకాణం తెరిచాడు.

ఇంతలో దుకాణం ముందుకు ఎవరో వచ్చారు. భద్రయ్య అటు చూసి కొయ్య బారిపోయాడు. యములవాడులాగా తారాచంద్ నిలబడి ఉన్నాడు! అతను తన హారాలను కొట్లోనే వదలినట్టు తెలిసి, వాటికోసం వచ్చాడనుకునే సరికి, భద్రయ్యకు ముచ్చెమటలు పోశాయి.

తారాచంద్ హారాల సంచీ పైకి తీసి, ''ఒకసారి సానపట్టి చూడండి!'' అన్నాడు.

తాను పోగొట్టుకున్న సంచీ తిరిగి తారాచంద్ చేతికే ఎలా వచ్చిందో భద్రయ్యకు అర్థం కాక, మతిపోయి నట్టయింది. అతను బంగారాన్ని గీచి



చూసి, ''ఇవి అసలు హారాలే! కాని మళ్లీ తెచ్చారెందుకు?'' అని అడిగాడు.

తారాచంద్ ఇలా చెప్పాడు:

''అదంతా ఒక కథ. నేను బజారు వెంటపోతూ చూసుకుంటే నగల సంచీ లేదు. గుండె జారిపోయింది. కాస్తా, కూస్తానా? ఇరవైవేల సరుకు! వెర్రెత్తి నట్టు అందరినీ అడుగుతూ, అంతటా వెతుకుతూ ఇంటికి చేరాను. మా ఇంటి వాకిట ఓ కుర్రవాడు కూర్చుని ఉన్నాడు. వాడి చేతిలో సంచీ ఉన్నది! దాన్ని చూడగానే ప్రాణం లేచి వచ్చినట్టయింది. అందులో నా హారాలున్నాయని గుర్తులు చెప్పాను. ఏ తల్లి బిడ్డడో గాని, నీతి,

నిజాయితీగలవాడు! ఆ సంచీ నాకు ఇచ్చేశాడు! నేను వాడికి వెయ్యిరూపాయలు బహుమానంగా ఇచ్చాను. మళ్ళీ అనుమానం వచ్చింది; హారాలు అసలువో నకిలివో తేల్చుకుందామని వచ్చాను.''

తారాచంద్ నగలు తీసుకుని వెళ్ళిపోయాడు. భద్రయ్యకు నవ్వాలో, ఏడవాలో తెలీలేదు. నగలు చేరవలసిన చోటికి చేరాయి. తన జీతం డబ్బులేపోయాయి!

భద్రయ్య మళ్ళీ దుకాణం మూసి, కాళ్ళీడ్చుకుంటూ ఇంటికి పోయి, తన భార్యతో దాచకుండా జరిగినదంతా చెప్పి, తన దుర్బుద్ధికి శిక్షగా నెలజీతం పోగొట్టుకున్నానన్నాడు.

భద్రయ్యను అతని భార్య ఊరడించటానికి ప్రయత్నించింది. కాని నెల గడిచేది ఎలాగో ఆవిడకు అంతుబట్టలేదు. తాకట్టు పెట్టించటానికి ఆమె తన చేతి బంగారు గాజులు తీస్తూండగా, భద్రయ్య పెద్దకొడుకు చంద్రయ్య వచ్చాడు. వాడు తండ్రితో ఇలాఅన్నాడు:

''నాన్నా, ఇవాళ ఏం జరిగిందో తెలుసా? నువు మామూలు వేళకు ఇంటికి రాకపోయేసరికి, నిన్ను భోజనానికి పిలుద్దామని మీ దుకాణానికి వస్తే, దుకాణం మూసి ఉన్నది. దాని మెట్ల పక్కన ఒక చిక్కం సంచీ పడిఉన్నది. తీసి చూస్తే అందులో రెండు వజ్రాల హారాలున్నాయి. ఎవరిసొమ్ము వారికి అందించటం నీతి అని నువు చెబుతూంటావు. చూడూ! హారాల మీద తారాచంద్ పేరు ఉన్నది. వెంటనే అతని ఇంటికి పోయాను. కొంచెం సేపటికి తారాచంద్ ఇల్లు చేరి, హారాల గుర్తులు చెప్పి, సంచీ తీసుకుని, నాకీ బహుమానం ఇచ్చాడు, చూడు!''

తన దుర్బుద్ధి తనను శిక్షించిందనుకున్నాడు. కాని తన కొడుకు నిజాయితీ తనను కాపాడినందుకు భద్రయ్య సంతోషించాడు. తారాచంద్ ఇచ్చిన బహుమానంతో భద్రయ్య కూతురి పెళ్ళి ఖర్చులు గడిచాయి!





# రాతి కింద జల

పూర్వం కాశీరాజ్యాన్ని బ్రహ్మదత్తుడు ఏలేటప్పుడు బోధిసత్త్వుడు సార్థవాహకుల వంశంలో పుట్టాడు. అతను పెరిగి పెద్దవాడై, అయిదువందల బళ్ళతో వర్తకం చేసేవాడు.

ఒకసారి అతని బిడారు ఎడారి ప్రాంతం చేరింది. ఆ ఎడారి అరవై యోజనాల నిడివిగలది. అందులోని ఇసుక చాలా సన్ననిది, గుప్పిట పట్టుకుంటే వేళ్ళ సందులనుంచి జారిపోతుంది. ఆ ప్రదేశం రాత్రిపూట చల్లగా ఉంటుంది. కాని సూర్యోదయం అయినది మొదలు క్రమంగా వేడెక్కి, భగభగా మండే కుంపటిలాగా అయిపోతుంది. పట్టపగలు ఆ ఎడారిలో నడవటం సాధ్యం కాదు. అందుచేత ప్రయాణీకులు ఎడారి దాటే దాకా తమకు అవసరమైన బియ్యమూ, నూనే, వంట చెరకూ, నీరూ బళ్ళలో తీసుకుని, రాత్రి పూటనే ప్రయాణం చేస్తారు. సముద్రం మీద ప్రయాణం చేసే నావికులలాగే ఈ ఎడారి ప్రయాణీకులు నక్షత్రాల సహాయంతో తాము ఎటుపోతున్నదీ తెలుసుకుంటారు. తెల్లవార వస్తూండగా వాళ్ళు ప్రయాణం చాలించి, బళ్లను వలయాకారంగా నిలబెట్టి, మధ్య మంటపం లాగా అమర్చి, దాని మీద చాందినీలాటిది కట్టి, పొద్దెక్కకుండానే వంటా, భోజనాలూ ముగించి, తిరిగి పొద్దువాలేదాకా నీడపట్టున విశ్రాంతి తీసుకుంటారు.

బోధిసత్త్వుడు ఇలాగే ప్రయాణంచేస్తూ దాదాపు ఎడారి దాటాడు. ఇంకా ఒక్క యోజనం ప్రయాణం మాత్రమే మిగిలి ఉన్నది. ఆ రాత్రి ఆ యోజనమూ దాటవచ్చుననుకుని, అతను సాయంకాలం బయలుదేరే ముందు, తన సేవకులచేత



వంట చెరుకూ, నీరూ పారేయించాడు. ఈ విధంగా బరువు తగ్గించుకుంటే ప్రయాణం మరింత చురుకుగా సాగుతుంది.

అన్నిటికన్న ముందు ఉండే బండిలో దారి నిర్ణయించేవాడు ఉంటాడు. అతను రాత్రంతా మేలుకుని వుండి, నక్షత్రాల గమనాన్ని జాగ్రత్తగా చూస్తూ, ముందు బండి ఎక్కడ ఎటుపోవాలో కేకవేసి చెబుతూ ఉంటాడు.

కాని ఈసారి అతను నిద్రచాలక, బడలి ఉండటం చేత నిద్ర పోయాడు. ఎడ్లు తోలేవాడు లేక, అదుపు తప్పి, వచ్చినదారే పట్టాయి.

అరుణోదయం అవుతూండగా అతను నిద్రలేచి, నక్షత్రాలను గమనించి, బళ్ళు వెళ్ళవలసినదారికి ఎదురు దిక్కుగా, అంటే వచ్చిన దిక్కుకే, పోతున్నట్టు తెలుసుకుని, "బళ్లను వెనక్కుతిప్పండి!" అని కేకపెట్టాడు.

బళ్ళు వెనక్కు తిరిగాయి, కాని జరగవలసిన పెద్ద ప్రమాదం జరిగిపోనే పోయింది.

తెల్లవారేసరికి బిడారు కిందటి సాయంకాలం బయలుదేరిన చోటనే ఉన్నది. నీరు మాత్రం లేదు!

మళ్ళీ బళ్లు వలయాకారంగా అమర్చి, జరిగిన పొరబాటుకు విచారిస్తూ, నిస్పృహతో మనుషులందరూ బళ్ళకింద చతికిలబడ్డారు.

అందరిలాగా తాను కూడా అధైర్య పడితే అందరూ చచ్చిపోవటం తథ్యం. అందుకని బోధిసత్వుడు ఆ చల్లటివేళ అటూ, ఇటూ తిరుగుతూ, నీటిజాడ కోసం అమిత శ్రద్ధగా చూస్తూ, ఒక చోట గుబురుగా పెరిగిన దర్భల దుబ్బు చూశాడు. కింద ఎక్కడో నీరు లేకపోతే అక్కడ ఆ దుబ్బు మొలవదు!

బోధిసత్వుడు మనుషులను పంపి పలుగు తెప్పించి, ఒక కుర్రవాడి చేత దుబ్బువున్న ప్రదేశాన తవ్వించాడు.

అరవైమూరల లోతు తవ్వినాక పలుగుకు కంగుమని రాయి తగిలింది. అందరి ప్రాణాలూ ఉసూరుమన్నాయి. కాని బోధిసత్త్వుడికి మాత్రం రాతి కింద నీరు ఉండి తీరుతుందని గట్టి నమ్మకం. అతను గుంటలోకి దిగి, రాతికి చెవి పెట్టి ఆలకించాడు. రాతికి దిగువగా ప్రవహిస్తున్న నీటి చప్పుడు విని పిస్తున్నది.

అతను గుంటలో నుంచి పైకి వచ్చి, "బాబూ, మనం ఇప్పుడు నిరాశపడి కాళ్లు బారజాచామంటే, అందరం చచ్చిపోతాం. నువు కిందికి దిగి, దీక్షగా ఆ రాతిని పగలగొట్టాలి. దానికింద నీరున్నది. అది పైకి వచ్చిందంటే అందరూ బతికిపోతాం!" అన్నాడు.

బోధిసత్త్వుడు ప్రకటించిన విశ్వాసం మరెవ్వరికీ లేదు. అయినా అతను చెప్పాడు గదా అని, కుర్రవాడు గోతిలోకి దిగి, ఇనపగూటంతో శక్తి కొద్దీ రాతిని కొట్టాడు.

చివరకు రాయి పగిలింది. దాని కింద అణిగి ఉన్న నీరు తాడిప్రమాణం, ఉవ్వెత్తుగా పైకి లేచింది.

అందరికీ పోతున్న ప్రాణాలు తిరిగి వచ్చినట్టయింది. అందరూ దాహం తీర్చుకుని, స్నానాలు చేశారు. మరీ పాతబడిన బండి చక్రాలు నరికి, వంట చెరుకుగా ఉపయోగించి, వంటలుచేసి, భోజనాలు చేశారు. పశువులకు మేతా, నీరూ పెట్టి, సాయంకాలం అయినదాకా విశ్రాంతి తీసుకుని, రాత్రికాగానే తిరిగి ప్రయాణమై పోతూ, నీరు పడినచోట ఒక ధ్వజస్తంభం నీరున్నట్టు గుర్తుగా పాతి, తెల్లవారేలోపల ఎడారి దాటి గమ్యస్థానం చేరారు.

వారి సరుకులు మూడింతలు ధరకు అమ్ముడు అయాయి. ఖర్చులుపోగా న్యాయమైన లాభం మిగిలింది.

బోధిసత్త్వుడు కొన్నాళ్ళకు తన స్వస్థానానికి తిరిగి వచ్చి, వర్తకం మీద సంపాదించిన దానితో దానధర్మాలు చేస్తూ, సుఖంగా జీవించాడు.





# లభ్యంగాని ఆవాలు

ఒకనాడు యశోధర తన కొడుకు రాహులుడితో, "మీ తండ్రి వద్ద నాలుగు పెట్టెల నిండా ఆభరణాలు ఉండేవి అయన కొడుకువు గనక, అవి నీకే చెందుతాయి. అవి ఎక్కడ ఉన్నాయో అయనను వెళ్ళి అడుగు," అన్నది. మహాత్ముడైన బుద్ధుడితో మాట్లాడే అవకాశం వచ్చిందని రాహులుడు సంతోషించాడు.

రాహులుడు బుద్ధుణ్ణి కలుసుకుని, "నాన్నా, నీ సొత్తు నాకు ఇయ్యి," అన్నాడు. బుద్ధుడు చిరునవ్వు నవ్వి, "నా వారసుడివిగా నీకు నా ఉత్తమ సంపదను—నా జ్ఞానాన్ని—ఇస్తాను," అని, తన ప్రధాన శిష్యులలో ఒకడైన సారిపుత్త అనే అతనితో, రాహులుడికి సన్యాసం ఇయ్యమన్నాడు.





ఇది తెలిసి శుద్ధోదనరాజుకు చాలా విచారం కలిగింది. అయన బుద్ధుడి వద్దకు వెళ్ళి, "ప్రభూ, మీరు రాజ్యం తిరస్కరించారు, మీ తమ్ముడు అనందుడి చేత తిరస్కరింపజేశారు. ఇప్పుడు మీ కొడుకు కూడా అందకుండా పోయాడు. ఇక నా కెవరున్నారు?" అని అడిగాడు. అప్పుడు బుద్ధుడు, ఏ యువకుడు గాని తల్లిదండ్రుల అనుమతి లేకుండా సన్యసించరాదని నియమం ఏర్పాటు చేశాడు.



శ్రావస్తిలో సుదత్తుడు అనే ధనిక వర్తకుడు ఉండేవాడు. ఆయన బుద్ధుడికి వానాకాలంలో ఉండటానికి అందమైన జేతవనం ఇద్దామనుకున్నాడు. ఆ వనం జేత అనే క్షత్రియుడిది. సుదత్తుడు ఆ వనం అంతటా బంగారం పరిచి, దాన్ని మూల్యంగా ఇస్తే వనాన్ని అమ్ముతానని జేత అన్నాడు.

సుదత్తుడు తన కున్నదంతా అమ్మి బంగారు రేకులు కొన్నాడు. కాని అవి వనంలో సగం భాగం మాత్రమే పరచటానికి సరిపోయాయి. అయినా జేత ఇది చూసి ముగ్ధుడై, మిగిలిన వనంలో తాను బంగారం పరిచాడు. ఇద్దరూ కలిసి బుద్ధుడికి స్వాగతం చెప్పారు.





బుద్ధుడు జేతవనంలో ఉండగా, గౌతమి అనే కులస్త్రీ తన కొడుకును కోల్పోయింది. బంధువులు ఎన్ని విధాల చెప్పినా ఆమె తన కొడుకు శవాన్ని ఉత్తరక్రియలకు ఇయ్యక, అమితమైన దుఃఖంతో బాధపడింది.

"నీ కొడుకును బుద్ధుడు గాని బతికించ గలడేమో ?" అని కొందరు గౌతమితో అన్నారు. ఆమె శీఘ్రంగా బుద్ధుడి వద్దకు వచ్చింది. "సోదరీ, మృత్యువు ఎన్నడూ ప్రవేశించని ఇంటి నుంచి ఒక ఆవగింజ తీసుకురా. నీ కొడుకు బతుకుతాడు," అన్నాడు బుద్ధుడు ఆమెతో.





తాను తెచ్చే ఆవగింజతో బుద్ధుడు అద్భుతం చేస్తాడు కాబోలునని, గౌతమి ఇల్లిల్లూ తిరిగింది. కాని మృత్యువు ప్రవేశించని ఇల్లు ఆమెకు ఎక్కడా కనిపించలేదు. అత్యంత ధనికుడి ఇంట ఆ ఏడు మూడు మరణాలు సంభవించాయట!

ఆమె ఒక ప్రసిద్ధ వైద్యుడి ఇంటికి వెళ్ళింది, అలాటి వైద్యుడి ఇంట మృత్యువు అడుగుపెట్టజాలదను కుంటూ. అయితే, ఆ వైద్యుడి కొడుకూ, కూతురూ కూడా మృత్యువుపాలైనట్టు ఆమెకు తెలిసింది!





బుద్ధుడు తనకు చేయదలచిన ఉపదేశం ఏమిటో క్రమంగా గౌతమికి తెలిసి వచ్చింది. ఆమె తన కుమారుడి శవాన్ని శ్మశానానికి తీసుకుపోయి, దాన్ని చితి మీద పెట్టి, "నాయనా, చనిపోయిన వారంతా నా లాటి తల్లుల బిడ్డలే!" అన్నది.

సాయంకాలానికి గౌతమి బుద్ధుడి వద్దకు తిరిగి వచ్చింది. "ఆవగింజ దొరికిందా?" అని బుద్ధుడు అడిగాడు. "లేదు, దేవా! కాని నాకు నీ ఉపదేశం లభించింది," అన్నది గౌతమి. ఆమె ఇప్పుడు జీవిత లక్ష్యం తెలుసుకునే స్థితిలో ఉన్నది. బుద్ధుడు ఆమెకు దాన్ని బోధించాడు. ఆమె అతని శిష్యురాలయింది.






బుద్ధుడు వైశాలిలో ఉండగా, ఒకనాడు అతనికి తన తండ్రి మరణించనున్నట్టు తెలిసింది. అతను కపిలవస్తుకు వెళ్ళి, మరణిస్తున్న తండ్రిని దీవించాడు. తరవాత అతను తన మతాన్ని ప్రజలలో ప్రచారం చెయ్యటానికి బయలుదేరాడు.

# దొంగను దొంగ దోచడు

ఒక రోజు రాత్రి సింగన్న అనే దొంగ రాజుగారి కోశాధికారి అయిన నాగవర్మ ఇంట దొంగతనం చెయ్యటానికి వెళ్ళాడు.

ఆ సమయంలో నాగవర్మ తన భార్యతో, "ఈ రోజు రాజుగారికి తెలియకుండా నూరు వరహాలే తేగలిగాను. ఇంకో నూరు తెస్తే పదివేలూ పూర్తి అవుతాయి," అంటున్నాడు.

అది విన్న సింగన్న తిరిగి వెళ్ళిపోబోతూ నాగన్న కంటపడ్డాడు. తనను పట్టుకోబోయిన నాగన్నతో అతను, "నే నేమీ తీసుకోలేదులే. బిచ్చగాణ్ణి బిచ్చగాడు యాచించడు; దొంగను దొంగ దోచుకోడు!" అన్నాడు.

నాగన్న మండిపడి, "రాజుగారి కోశాధికారిని! నన్ను దొంగ అంటావా?" అన్నాడు.

సింగన్న నవ్వి, "నేనంతా విన్నానులే. రాజుగారికి తెలియకుండా ప్రజల సొమ్ము దోచిన వాడివి, నువు దొంగవు గాక దొరవా? నిజం ఒప్పుకోలేని నువు నా కన్న అధముడివి!" అన్నాడు, వెళ్ళిపోతూ.

ఏమనుకున్నాడో ఏమో, నాగవర్మ మర్నాడు ఎవరికీ తెలియకుండా తాను తస్కరించిన దంతా తిరిగి ఖజానాకు జమకట్టేశాడు. — పి. వి. వి. కె. సుబ్బారావు





# అక్రమ సహాయం

శిల్లంగేరి గ్రామంలో తిరుపాలు అనే దురాశాపరుడైన ధనికుడు ఉండే వాడు. అతను ప్రత్యేకించి జూదగాళ్లకు అప్పులు పెట్టేవాడు. ఎందుకంటే జూదగాడు ఆశావాది: గెలుస్తానన్న నమ్మకంతో ఏది బడితే అది తాకట్టుపెట్టి అప్పు తీసుకుంటాడు. జూదంలో వాడు ఓడిపోయి, బాకీ చెల్లించకపోతే, అప్పుకు పదింతలు విలువచేసే వస్తువు బాకీదారు సొంతం అవుతుంది. అలాకాక జూదగాడు జూదంలో గెలిచాడా, తన అప్పు తీర్చేటప్పుడు ధారాళంగా ఎంత వడ్డీ అయినా ఇస్తాడు. అందుచేత జూదగాళ్ళకు అప్పు పెట్టినవాడు నష్టపోవటం అంటూ ఉండదు. మామూలు వడ్డీవ్యాపారులు ఎప్పుడైనా నష్టపోతే పోవచ్చుగాని!

తిరుపాలు జూదగాళ్ళకు అప్పులుపెట్టి ఏ మామూలు వడ్డీ వ్యాపారి కూడా సంపాదించలేనంతగా సంపాదించాడు. ఇలాటి వ్యాపారంతో కొంపలు తీయవద్దని ఊళ్ళో పెద్దలూ, పొరుగూరైన గంగాపురానికి చెందిన పెద్దిరెడ్డీ తిరుపాలుకు ఎంతగానో చెప్పి చూశారు. కాని తిరుపాలు ఎవరి మాటా చెవిని బెట్టలేదు.

కొంత కాలానికి ఊళ్ళో ఉండే పెద్ద జూదగాళ్ళంతా పోయారు. దానికి తగ్గట్టు జూదాల మీద నిషేధం కూడా వచ్చింది. ఈ పరిణామానికి ఊళ్ళో అందరూ సంతోషించినా, తిరుపాలు మాత్రం జూదగాళ్ళ ద్వారా ఎంతోకాలంగా తీయకుండా వస్తున్న తన ఆదాయం పోయిందని మహా బాధపడ్డాడు.

ఇలా ఉండగా ఒకరోజు రాత్రి తిరుపాలు ఇంటికి పొరుగూరి పెద్దిరెడ్డి వచ్చి, తనకు జూదం ఆడే దురలవాటు పట్టుకున్నదనీ, ఒక వందరూపాయలు

కోలార్ కృష్ణఅయ్యర్

అప్పు ఇయ్యమనీ అన్నాడు. పెద్దిరెడ్డికి శిళ్ళంగేరిలో కూడా భూములున్నాయి. వాటిని కాజెయ్యవచ్చునన్న దురాశతో తిరుపాలు పెద్దిరెడ్డి చేత పత్రం రాయించి పుచ్చుకుని, వందరూపాయలు అప్పు ఇచ్చాడు.

ఇంతేకాదు, శిళ్ళంగేరిలో మళ్ళీ జూదాలు ఆరంభమైతే తన పాతవృత్తి మళ్ళీ కొనసాగించ వచ్చునన్న ఆశతో, తిరుపాలు జూదం ఆడుతున్న వాళ్ళు ఎవరో తెలుసుకుందామని, పెద్దిరెడ్డి వెనకగా వెళ్ళాడు. పెద్దిరెడ్డి ఊరిబయట ఒక పాడుబడిన ఇంట ప్రవేశించాడు. తిరుపాలు కిటికీలో నుంచి లోపలికి చూసి ఆశ్చర్యపోయాడు.

లోపల జూదం జోరుగాసాగుతున్నది. అయితే ఆ ఆడే వాళ్ళంతా తనవద్ద అప్పులు పుచ్చుకుని, కాలక్రమాన చచ్చి పోయిన జూదగాళ్ళే!

పాపం, పెద్దిరెడ్డి ఆ సంగతి ఎరగక దయ్యాలతో జూదం ఆడుతున్నాడు. అతను గెలిచేమాట కల్ల!

తిరుపాలు అనుకున్నట్టే పెద్దిరెడ్డి మర్నాడు రాత్రి మళ్ళీ వచ్చి, పత్రం రాసి కొంతడబ్బు పట్టుకుపోయాడు. తరవాత అతను రోజూ తిరుపాలు వద్దకు రావటమూ, పత్రం రాసి వందా, రెండు వందలూ పట్టుకుపోవటమూ జరుగుతూ వచ్చింది. దయ్యాలు పెద్దిరెడ్డిని దోస్తున్నాయి. తానుకూడా పెద్దిరెడ్డిని



దోస్తున్నందుకు తిరుపాలు చాలా సంతోషించాడు.

ఇలా ఇరవైరోజులు గడిచాక, తిరుపాలు పెద్దిరెడ్డితో, "అయ్యా, మీ అప్పు చాలా పెరిగి పోయింది. ఈ ఊళ్ళో మీకున్న పొలాలు తాకట్టుపెట్టి, మీకు కావలసిన సొమ్ము పట్టుకుపోతే బాగుంటుంది," అన్నాడు.

"మళ్లీ తాకట్టు దేనికి? ఆ పొలం నీకు విక్రయం చేసేస్తాను. పత్రం రాయించి, సాక్షులను వెంటబెట్టుకుని, నీకు వీలైన రోజున మా ఊరు వచ్చెయ్యి. ఇప్పుడు అవసరంగా ఒక వెయ్యి సర్దు!" అన్నాడు పెద్దిరెడ్డి.

తిరుపాలు రెడ్డికి వెయ్యిరూపాయలూ ఇచ్చి, విక్రయ పత్రం రాయించి, సాక్ష్యానికి తన స్నేహితులను వెంటబెట్టుకుని గంగాపురం వెళితే, పెద్దిరెడ్డి పోయి నెల దాటినట్టు తెలిసింది!

తిరుపాలు బిక్కచచ్చి ఇంటికి వచ్చి, పెద్దిరెడ్డి నుంచి తాను తీసుకున్న పత్రాలు చూస్తే, వాటి మీద పెద్దిరెడ్డి చేసిన సంతకాలు లేవు!

ఆ రాత్రి పెద్దిరెడ్డి మళ్ళీ వచ్చాడు. అతన్ని చూసి తిరుపాలు వణికిపోతూ, "అయ్యా, పెద్దిరెడ్డిగారూ! నన్ను ఇంతటితో వదిలిపెట్టండి!" అన్నాడు.

"అది ఎలా కుదురుతుంది? నువ్విచ్చిన డబ్బుతో నా జూదరి స్నేహితుల కుటుంబాల వారికి జరిగిన నష్టం ఇంకా పూడలేదు. నువు చాలా కొంపలు తీశావు. నేను ఒక్కొక్క కొంపే నిలబెట్టుతూ వస్తున్నాను. ఎన్ని కొంపలు కూల్చావో అన్నీ తిరిగి నిలబడేదాకా నేను నిన్ను వదలను!" అన్నాడు దయ్యం అయిన పెద్దిరెడ్డి.

"ఎవరి సొమ్ము వారికి తిరిగి ఇచ్చేస్తాను. నా మాట నమ్మండి," అన్నాడు తిరుపాలు చెమటలతో తడిసి ముద్ద అయిపోతూ.

ఆ మరుక్షణం పెద్దిరెడ్డి అదృశ్యమయాడు.



# ఎవరు కొడుకు?

గురవయ్యకు సంతానం లేదు. భార్య అకస్మాత్తుగా పోయింది. మళ్ళీ పెళ్ళిచేసుకోవడానికి మనసొప్పక, ఒంటరిగా ఉండనూలేక, దిక్కులేని శీనయ్యను చేరదీసి, కన్నకొడుకులా చూసుకోసాగాడు.

ఇది తెలిసి, దూరగ్రామంలో ఉంటున్న గురవయ్య తమ్ముడు రమణయ్య అన్నను చూడవచ్చి, "అన్నయ్యా, నువు ఎవరో అనాథను పెంచుతున్నావట. ఎంతైనా పరాయివాడు కన్నకొడుకు కాలేడు గదా?" అన్నాడు.

గురవయ్య సమాధానం చెప్పలేదు. రమణయ్య వెళ్ళిపోయాడు.

కొన్ని సంవత్సరాలకు రమణయ్య తన అన్నను చూడవచ్చి, "అన్నయ్యా, నా సొంత కొడుకే నాతో తగాదాపడి, వేరే కాపరం పెట్టాడు. మరి నువు పెంచుతున్న శీనయ్య నీ కెంత ద్రోహం చేశాడో?" అన్నాడు.

"వాడు నన్ను తండ్రి కన్న ఎక్కువగా చూసుకున్నాడు. నేను మంచాన పడితే నన్ను అహోరాత్రాలు సేవించాడు. నా తల కింద కొరివి పెట్టాడు. నా అస్థికలు గంగలో కలపడానికి కాశీ వెళ్ళి ఉన్నాడు!" అంటూ గురవయ్య గాలిలో కలిసిపోయాడు.

— శరత్





# ముందుచూపు

ఒక గ్రామంలో శివయ్యా, భూపతీ అని ఇద్దరు స్నేహితులు ఉండేవారు. ఇద్దరూ వ్యాపారం చేసేవారే కాని, భూపతి శివయ్యకన్న చాలా భారీ ఎత్తున వ్యాపారం చేసేవాడు. అతనితో పోలిస్తే, శివయ్య చాలా చిన్నవ్యాపారస్థుడు. ఇద్దరి పిల్లలూ పట్నంలో పెద్ద చదువులు చదువుతూండే వారు.

ఒకసారి శివయ్య భూపతితో, "మన కాలమంతా సంసార తాపత్రయంతోనే గడిచిపోతున్నది. మనస్సుకు శాంతీ, విశ్రాంతీ కలగగలందులకు కొంతకాలం పాటు మనం తీర్థయాత్రలు చేసి, పుణ్య స్థలాలు దర్శనం చేసుకుంటే బాగుంటుంది గదా!" అన్నాడు.

భూపతి సంశయిస్తూ, "అందుకు చాలా డబ్బు అవుతుందేమోనే?" అన్నాడు.

"ఇటువంటి విషయాలలో డబ్బు ఖర్చుకు వెనకాడతారా? మనిద్దరికీ సరిపడా నా దగ్గిర డబ్బున్నదిలే! బయలుదేరు," అన్నాడు శివయ్య, భూపతి కన్న తాను గొప్ప సంపన్నుడు అయినట్టు.

ఇద్దరూ కలిసి శివయ్య డబ్బుతో యాత్రలు ముగించుకుని తిరిగి వచ్చే సమయానికి, ఊళ్ళోవాళ్ళు శివాలయం కట్టించటానికి తీర్మానించి, చందాలు వసూలు చేస్తూ, భూపతి ఇంటికి వచ్చారు. ఆ సమయానికి శివయ్య కూడా అక్కడే ఉన్నాడు.

భూపతి చందాలు వసూలు చేస్తున్న వాళ్ళతో, "ప్రస్తుతం నా చేతిలో డబ్బు లేదు. అందరి వద్దా వసూలు అయినాక రండి," అన్నాడు.

"మీ మాట ఏమిటి?" అని వాళ్లు శివయ్యను అడిగారు.

ఎస్. నాగమణి

"నాకు ముందే తెలిసిందిలే. మీరు ఎప్పుడు వస్తే అప్పుడు ఇయ్యమని నా భార్య వద్ద నూరు రూపాయలు ఇచ్చాను. మా ఇంటికి వెళ్ళి తీసుకోండి," అన్నాడు శివయ్య వాళ్ళతో.

తరవాత కొన్నాళ్ళకు శివయ్య పని మీద పట్నం వెళ్ళి, తన పిల్లలతో బాటు భూపతి పిల్లల యోగక్షేమాలు కూడా విచారించాడు.

భూపతి పెద్దకొడుకు శివయ్యతో, "బాబుగారూ, ఏకారణం చేతనో మానాన్న మాకు రెండు నెలలుగా డబ్బు పంప లేదు. జీతాలు త్వరలో కట్టకపోతే పేర్లు కొట్టేస్తారు! మా నాన్నతో కాస్త చెప్పండి," అన్నాడు.

శివయ్య ఈ మాట విని ఎంతో నొచ్చుకుని, తన దారిఖర్చులకు పోగా మిగిలినదంతా భూపతి కొడుక్కు ఇస్తూ, "ప్రస్తుతం ఈ డబ్బు ఉపయోగించు. నేను ఇంటికి పోతూనే మీ ఇబ్బంది చెప్పి మీ నాన్నను సంగతేమిటో అడుగుతాను!" అన్నాడు.

అలాగే శివయ్య తిరిగి వస్తూనే భూపతి ఇంటికి వెళ్లి, ఆతన్ని గట్టిగా మందలించి, "ఇంత పెద్దవ్యాపారం చేస్తున్నావు. పిల్లలకు సమయానికి డబ్బు పంపకపోతే వాళ్ల చదువు ఏమైపోతుందనుకున్నావు?" అన్నాడు.

అందుకు భూపతి నిస్సహాయుడల్లే, "నన్ను ఏం చెయ్యమంటావురా? పెద్ద



వ్యాపారం చేస్తున్న మాట నిజమేగాని, నిజంగా అవసరం వచ్చేసరికి చేతిలో పైసా ఉండదు! పిల్లలకు రేపు డబ్బు పంపుదామనుకుంటున్నాను. చూడు, శివయ్యా! నాకు చాలా కాలంగా ఒక అనుమానం: పెద్దవ్యాపారం చేస్తున్నానా, నాచేతిలో సమయానికి చిల్లిగవ్వ ఉండదే, నువు చిన్నవ్యాపారం చేస్తున్నా ఎప్పుడూ నీ చేతిలో డబ్బు ఆడుతూ ఉంటుంది! ఇది ఎలా సాధ్యం? నీ దగ్గిర మూలధనమైనా ఉండాలి, లేదా, నీకు లంకెబిందెలేవైనా దొరికి ఉండాలి! ఆ రహస్యం ఏమిటో కాస్త నాక్కూడా చెప్పు,'' అన్నాడు.

శివయ్య నవ్వి, ''మా ఇంటికి రా, నా రహస్యం చూపిస్తాను,'' అన్నాడు.

అతను భూపతిని తీసుకుపోయి తన దేవుడి గదిలో ఉన్న నాలుగైదు హుండీలు చూపించాడు.

''ఏమిటివి?'' అని భూపతి అతన్ని అడిగాడు.

''ఇవే నా మూలధనమూ, లంకెబిందెలూనూ! నా రహస్యం పొదుపు! నేనూ, నా భార్యా కూడా చేతిలో ఉన్న డబ్బును వీలయినంత పొదుపుగా వాడి, ఏ రోజుకారోజు మిగిలిన డబ్బును ఈ హుండీలలో వేస్తాం. ఈ హుండీలలో ఒకటి దైవకార్యాలకు, ఒకటి పిల్లల చదువులకు, ఒకటి పండగలకూ, పబ్బాలకూ, ఇంకొకటి పెళ్ళిళ్ళకూ, పేరంటాలకూ—ఇలా! మనం తీర్థయాత్రలు చేద్దామనుకున్నప్పుడు హుండీ విప్పి చూస్తే, అందులో చాలా డబ్బు ఉన్నది. దాంతో ఇద్దరమూ సుఖంగా పుణ్యక్షేత్రాలు తిరిగి వచ్చాం,'' అంటూ శివయ్య తన పొదుపు విధానం వివరించాడు.

అంతా విని భూపతి, ''ఇంతకాలమూ నాకీ పద్ధతి ఎందుకు చెప్పలేదురా? నేను కూడా ఇలాగే చేసి, ఎప్పటికప్పుడు డబ్బు కోసం కటకట పడకుండా ఉండేవాణ్ణి గదా! ఇకనుంచి అయినా నీ పొదుపు పద్ధతి నేనూ అవలంబిస్తాను,'' అన్నాడు.



# ఇష్టమైనవాడు

ఒక ధనికుడి కుమార్తెకు పెళ్ళి ఈడు వచ్చింది. మేనరికంలో ఆమెకు భర్త కాదగినవాళ్ళు ముగ్గురున్నారు. ఒకడు రాజుగారి సేనలో పెద్ద ఉద్యోగి. రెండోవాడు గొప్ప వర్తకుడు. మూడోవాడు కవిత్వమూ, చిత్రకళా తెలిసిన కళాకారుడు.

"ఈ ముగ్గురిలో నీకు ఎవరు ఇష్టమైతే వాడికే నిన్ను ఇచ్చి పెళ్ళిచేస్తాను," అన్నాడు తండ్రి.

"కళాకారుణ్ణి పెళ్ళిచేసుకుంటాను," అన్నది కూతురు.

"రాజుగారి కింద పెద్ద పదవిలో ఉన్నవాణ్ణీ, పుష్కలంగా డబ్బు సంపాదిస్తున్నవాణ్ణీ వదిలేసి కళాకారుణ్ణి కోరావేం?" అని తండ్రి అడిగాడు.

"సైనికాధికారి హెూదా ఒంట్లో శక్తి ఉన్నంతవరకే! వ్యాపారంలో కోట్లు గడించినవాడు కూడా తన అంచనా తలకిందులైతే, క్షణంలో బికారి కాగలడు. కాని కళాకారుడి స్థాయి అనుభవంతో ఎక్కువవుతుంది గాని తరగదు. బతికి ఉన్నంతకాలమూ అతడు ఉచ్చదశలోనే ఉంటాడు," అన్నది కూతురు.






పూర్వం చంద్రనగరంలో ఒక కరణం ఉండేవాడు. ఆయనకు అంతులేని పొలం, కట్టుకుపోయినన్ని పశువులూ ఉండేవి. అయినా పరమలోభి. కానీ ఖర్చు చేయాలంటే గిజగిజా తన్నుకునే వాడు.

ఒకరోజు కరణం ఆవులలో ఒక దానికి జబ్బుచేసి తీవ్రంగా పరిణమించింది. దాని పొట్ట ఉబ్బిపోయి శ్వాసకూడా సరీగా పీల్చలేకుండా ఉంది. కరణంగారికి ఆవు పోతున్నదన్న విచారంతో బాటు, దాన్ని ఊరి బయటికి లాగించటానికి రెండు రూపాయల ఖర్చు అవుతుందే అన్న విచారం కూడా పట్టుకుంది.

కరణంగారు ఈ విషయం భార్యతో అన్నాడు. ఆవిడకూడా లోభంలో భర్తకు తీసిపోయేదేమీ కాదు. "చచ్చిపొయ్యే ఆవును ఎట్లాగూ ఆపలేం. పై ఖర్చు తగలకుండా చూడండి," అన్న దావిడ భర్తతో.

"అదే నేనూ ఆలోచిస్తున్నాను." అన్నాడు కరణం.

కరణంగారు వీధిఅరుగు మీద కూచుని ఉండగా అటుకేసి ఒక యాయవారం బ్రాహ్మడు వచ్చాడు. ఆ బ్రాహ్మడు ఆ వూరికి కొత్త. ఆయనను చూడగానే కరణంగారికి మంచి ఆలోచన తట్టింది.

"ఏమయ్యా, బ్రాహ్మడా? సమయానికి కనిపించావు. నీకోసమే కబురు చేద్దామనుకుంటున్నాను," అన్నాడు కరణం.

"చిత్తం, చిత్తం! ఏమిటి విశేషం?" అన్నాడు యాయవార బ్రాహ్మడు.

"వెనక నాకు పెద్ద జబ్బు చేస్తే గోదానం చెయ్యమన్నారు. అది ఈనాటి దాకా పడిందికాదు. ఇవాళ నువు కనిపించావు. నువ్వయినా పిల్లాపీచు కలవాడివి. నీకు యిప్పుడే గోవును దానం

చేస్తాను. హాయిగా ఇంటికి పట్టుకుపో!'' అన్నాడు కరణం.

బ్రాహ్మడికి పరమానందమయింది. ఆయనది పిల్లా పీచూ గల సంసారం. పాలకు చాలా ఇబ్బంది పడిపోతున్నాడు. ఈ కరణంగారు పరమ లోభి అని విని ఈయనను ఎన్నడూ, ఏమీ యాచించ లేదు. కాని తీరా చూస్తే ఈయన మంచి దానపరుడులాగే కనిపించాడు.

''మీ రిస్తానంటే నేను కాదంటానా? కాని ఇవాళ అష్టమి, బాగా లేదు. ఎల్లుండి దశమినాడు దానం పడతాను,'' అన్నాడు బ్రాహ్మడు వినయంగా.

''అలా కాదు. ఇవాళే, ఇప్పుడే పుచ్చుకోవాలి. నాకు పనులు నానబెట్టటం బొత్తిగా పనికిరాదు. గోదానానికి కూడా తిథి వార నక్షత్రాలేమిటి?'' అన్నాడు కరణం.

కాదు కూడదంటే, కరణం ఆవును కాస్తా మరొకరి చేతిలో పెట్టేసి పోతాడని యాయవార బ్రాహ్మడు మంచిరోజు కాక పోయినా గోదానం పుచ్చుకోవటానికి సిద్ధమయాడు.

ఇద్దరూ బయలుదేరి కరణంగారి పశువుల శాలకు వెళ్ళారు. చావుబతుకుల మధ్య ఉన్న ఆవును చూపించి కరణంగారు, ''అదుగో మీ ఆవు. తీసుకుపో,'' అన్నాడు.

బ్రాహ్మడికి కరణం దుర్బుద్ధి అర్థమయింది. ఆ ఆవుమీద ఆశ వదులు



కున్నాకనే కరణంగారు దానం ఇవ్వ నిశ్చయించాడు. లేకపోతే కానీకి గడ్డితినే కరణంగారేమిటి? గోదానం చెయ్యట మేమిటి? గోదానం వెంటనే పుచ్చుకో మని ఆయన తొందరపెట్టటం కూడా ఇందుకే!

"దానికి ఒంట్లో బాగున్నట్టు లేదే?" అన్నాడు బ్రాహ్మడు.

"అది ఆరోగ్యంగా ఉందని నేనన్నానా? నేను దాన మిద్దామనుకున్నది ఇదే. జబ్బుగా ఉన్నా, చచ్చినా అది నీదే! నీకు దానం ఇచ్చేశాను. నా కిక దాని పూచీ ఏమీలేదు," అన్నాడు కరణంగారు.

"మీ చిత్తం, నా భాగ్యం! ఎవరి అదృష్టాని కెవరు కర్తలు? నా ఆవును నేను పట్టుకుపోతాను. ఒక్క క్షణం ఆగండి," అంటూ యాయవార బ్రాహ్మడు దొడ్లోకి వెళ్ళి ఏదో ఆకు కోసం వెతకసాగాడు.

ఈ బ్రాహ్మడి తండ్రి గొప్పపశువైద్యుడు. ఇతనికి కూడా కొన్ని మూలికలు తెలుసు. అతను కొద్ది సేపట్లోనే ఒక మొక్కను పట్టి, దాని ఆకులు కోసి తెచ్చి, వాటి రసం ఆవు ముక్కుల్లో పిండాడు.

వెంటనే ఆవు పెద్దగా తుమ్మింది. దాని గొంతులో నుంచి కఫం తాటికాయ ప్రమాణంలో తెగి పడింది.

ఆవు లేచి నిలుచున్నది. కరణంగారి పై ప్రాణం పైనే పోయినంత పనయింది. ఒక రూపాయి డబ్బులు ఖర్చయినా ఆ మాత్రం వైద్యం చేయించుకుంటే తన ఆవు తనకే వుండేదిగదా అని విచారించాడు.

బ్రాహ్మడు సంతోషంతో ఆవు మెడ నున్న పలుపు చేతపట్టుకుని, కరణంగారి దగ్గిర సెలవు పుచ్చుకుని, దానిని ఇంటికి తోలుకుపోయాడు.

"అయ్యో, నిక్షేపమంటి ఆవును నిష్కారణంగా యాయవార బ్రాహ్మడి పాలు చేశామే!" అన్నాడు కరణంగారు తన భార్యతో.

ఇద్దరూ కలిసి చాలాసేపు కంటికీ మంటికీ ఏకధారగా ఏడిచారు.





# దేవీ భాగవతం

ఒకప్పుడు సూర్యవంశంలో అరుణుడు అనే రాజు ఉండేవాడు. అతని కొడుకు సత్యవ్రతుడు. సత్యవ్రతుడి ప్రవర్తన అంత మంచిది కాదు. ఒకసారి అతను పెళ్ళి కాబోతున్న సమయంలో ఒక బ్రాహ్మణబాలికను ఎత్తుకుపోయాడు. ఆమె బంధువులు ఏడుస్తూ అరుణుడి వద్దకు వెళ్ళారు. వాళ్లను చూడగానే అరుణుడు తన కొడుకు ఏదో చెయ్యరాని పని చేసి ఉంటాడని ఊహించి, "నాకొడుకు తెలిసిగాని, తెలియకగాని మీకు ఏమన్నా ద్రోహం చేశాడా ?'' అని అడిగాడు.

''అవును, రాజా. పెళ్ళి కాబోతున్న మా పిల్లను నీ కొడుకు ఎత్తుకుపోయాడు." అన్నారు వాళ్ళు.

ఈ మాట విని రాజు మండిపడి, తన కొడుకును పిలిచి, ''దుర్మార్గుడా, నీ పేరే చెరుపుకున్నావు గదరా! ఇలాటి పాపిష్టి పని ఎందుకు చేశావు? నువు క్షత్రియ పుటక పుట్టలేదా? నా కడుపుచెడబుట్టావు. ఇక్కడ వుండదగవు. ఎక్కడికైనా వెళ్ళిపో!'' అన్నాడు.

సత్యవ్రతుడు జంకూ, గొంకూ లేకుండా, ''ఎక్కడికి పోను ?'' అని ఎదురు తిరిగి అడిగాడు.

''కుక్కలను తినేవాళ్ళు కూడా చెయ్యని పని చేశావు గనక చండాలురు ఉండే చోటికి పో. నీ అపకీర్తి నేను సహించను. నీ మూలంగా వంశం కళంకమయింది!'' అన్నాడు తండ్రి.

24. త్రిశంకుడి కథ



వసిష్ఠుడు అరుణుడి వైఖరిని ఎగదోశాడు. అందుచేత వసిష్ఠుడు అంటే మండిపడుతూ, సత్యవ్రతుడు విల్లంబులు తీసుకుని అరణ్యంలో ఆటవికుల మధ్య తిరగసాగాడు.

ఉన్న కొడుకును వెలివేసిన అనంతరం అరుణుడు మళ్ళీ కొడుకుల కోసం తపస్సు చేయటానికి అరణ్యానికి వెళ్లాడు.

అదే సమయంలో, అరుణుడి రాజ్యంలో అధర్మం జరిగిందని ఇంద్రుడు అక్కడ వాన కురవకుండా చేశాడు.

ఆ కాలంలోనే విశ్వామిత్రుడు తన భార్యనూ, కొడుకులనూ వదిలేసి, తపస్సు చేసుకోవటానికి కౌశికీ నదీ తీరానికి వెళ్ళాడు. ఇంతలో కరువు రావటంచేత, కొడుకులు ఆకలితో అల్లల్లాడిపోతూ, "అమ్మా, అన్నం!" అని ఏడుస్తుంటే, విశ్వామిత్రుడి భార్య అమితంగా బాధ పడింది. తన దగ్గిర చిల్లిగవ్వలేదు. తన భర్త తననూ, పిల్లలనూ గాలికి వదిలేసి తపస్సు చేసుకోబోయాడు. రాజునైనా యాచింతామంటే, రాజు నగరంలో లేడు: పిల్లల కోసం ఎక్కడో తపస్సు చేస్తున్నాడు. దిక్కులేని ఆడది పిల్లలకు ఎలా ఆకలి బాధ తీర్చగలదు?

"అందరూ ఆకలితో మాడి చచ్చేకన్న, మనసు రాయిచేసుకుని ఒక పిల్లవాణ్ణి తెగనమ్మితే, నాలుగు డబ్బులు వస్తాయి. కొంత కాలం మిగిలిన వాళ్ళ ప్రాణాలు నిలుస్తాయి! ఏ తల్లికీ రాగూడని పరిస్థితి నాకు దాపురించింది!" అనుకున్నది విశ్వామిత్రుడి భార్య.

ఇలా అనుకుని ఆమె తన కొడుకులలో మధ్య వాడి మెడకు దర్భలతాడు తగిలించి, వాణ్ణి విక్రయ పశువులాగా తీసుకుని, ఇంటి నుంచి బయలుదేరింది. ఆమె కొంగుపట్టుకుని లాగుతూ, "ఎక్కడికి పోతున్నావు?" అంటూ మిగిలిన కొడుకులు వెంటపడ్డారు.

ఈ దృశ్యాన్ని చూశాడు సత్యవ్రతుడు. అతను ఆమెతో, "ఏమమ్మా, గుండె

పగిలేటట్టు ఏడుస్తున్న ఈ కుర్రాడి మెడకు తాడుకట్టి ఎక్కడికి తీసుకుపోతున్నావు? ఏం జరిగింది? నువ్వు ఎవరు?'' అని అడిగాడు.

''విశ్వామిత్రుడు అనే మహాపురుషుడు నన్నూ, ఈ పిల్లలనూ వదిలేసి తపస్సు చేసుకోబోయాడు. బాబూ, నేను ఆ మహాత్ముడి భార్యను! డబ్బు లేదు! దిక్కులేని దాన్ని! పిల్లలను పోషించాలి గద? అందుకని వీణ్ణి అమ్మటానికి తీసుకుపోతున్నాను.'' అన్నది విశ్వామిత్రుడి భార్య.



''ఛీ, ఛీ! ఇదేం పని, తల్లీ! నువ్వు నీ ఆశ్రమానికి తిరిగి వెళ్ళు. నీ కొడుకులు రోజూ తినటానికి ఆహారం మూటగట్టి తెచ్చి, మీ ఆశ్రమంలో చెట్టుమీద ఉంచుతాను. మాట తప్పను. కొంత కాలానికి నీ భర్త రానేవస్తాడు,'' అన్నాడు సత్యవ్రతుడు.

ఈ మాటకు ఆమె ఎంతో సంతోషించి, తన పిల్లలతో ఆశ్రమానికి తిరిగి వెళ్ళింది. ఆమె కొడుకు గళానికి బంధం వేసిన కారణంగా అతనికి గాలవుడు అని పేరు వచ్చింది.

సత్యవ్రతుడు అన్నమాట తప్పకుండా, రోజూ లేళ్ళనూ, పందులనూ, ఎనుములనూ, కుందేళ్ళనూ చంపి తెచ్చి, మాంసం మూటగట్టి, విశ్వామిత్రుడి ఆశ్రమంలో చెట్టుకు కట్టేవాడు. ఆ మాంసంతో పిల్లల ఆకలి తీర్చుతూ విశ్వామిత్రుడి భార్య రోజులు వెళ్ళబుచ్చుతున్నది.

అరుణుడు కొడుకుల కోసం తపస్సు చేస్తానని వెళ్ళినప్పటి నుంచీ, వసిష్ఠుడు అయోధ్యలోనే ఉంటూ రాజనగరునూ, రాజభవనాన్నీ చూసుకుంటున్నాడు.

ఒక రోజు సత్యవ్రతుడికి వేటాడటానికి ఏ జంతువూ దొరకలేదు. అయితే నగరంలో వసిష్ఠుడి హోమధేనువు కనబడింది. అసలే వసిష్ఠుడంటే చాలా కోపంగా ఉన్నాడేమో సత్యవ్రతుడు




ఆ గోవును చంపి, దాని మాంసం తాను కొంత తిని, మిగిలినది మూటగట్టి విశ్వామిత్రుడి ఆశ్రమంలో చెట్టుమీద ఉంచాడు. అది అవు మాంసమని గుర్తించకుండా, విశ్వామిత్రుడి భార్యా, పిల్లలూ సంతోషంగా దాన్ని తినేశారు.

తన అవు చచ్చిందనీ, దాన్ని చంపిన వాడు సత్యవ్రతుడనీ వసిష్ఠుడికి తెలిసింది. ఆయన సత్యవ్రతుణ్ణి పట్టుకుని, "ఓరీ, దుర్మార్గుడా! నిన్ను త్రిశంకు డనవచ్చు! ఎందుకంటే, ఒకసారి బ్రాహ్మణ బాలికను హరించావు, తరవాత తండ్రిచేత వెలివేయ బడ్డావు; ఇప్పుడు గోవును నిష్కారణంగా చంపావు! ఇక నుంచీ నువు త్రిశంకు డని పిలవబడుతూ, లోకులకు పిశాచాకారంలో కనబడుతూ ఉండు!" అని శపించాడు.

అది మొదలు సత్యవ్రతుడు త్రిశంకుడై పోయి, పిశాచరూపంలో తిరుగుతూ, ఒక ముని కుమారుడి ఉపదేశం పొంది దేవిని గురించి తపస్సు చేయసాగాడు. అతను కొంతకాలం నవాక్షరీ మంత్రం జపించి, బ్రాహ్మణుల వద్దకు పోయి, "అయ్యా, నేనిప్పుడు హోమం చెయ్యాలి. మీరు ఋత్విక్కులుగా ఉండి, నా చేత హోమం చేయించి, నన్ను కృతార్థుణ్ణి చేయండి. నా పేరు సత్యవ్రతుడు." అన్నాడు.

దానికి బ్రాహ్మణులు, "నిన్ను నీకుల గురువు పిశాచం కమ్మని శపించాడు. నువు వేదోక్త కర్మలు ఎలా చేస్తావు?" అని అతన్ని తిట్టారు.

అంతటితో అతనికి జీవితం మీద విరక్తి కలిగింది. తండ్రి తనకు రాజ్యం లేకుండా చేశాడు, కులగురువు తనను శపించాడు, ఏపని చెయ్యటానికీ పనికిరాని స్థితిలో తానున్నాడు! ఇంక బతికి ఏం ప్రయోజనం.

ఇలా అనుకుని త్రిశంకుడు ఎండు కట్టెలతో చితిపేర్చి, దానిమీద కాలి పోవటం కోసం, స్నానం చేసి, జగజ్జననిని స్మరిస్తూండగా, ఆకాశంలో దేవి

ప్రత్యక్షమై, ''తొందరపడకు. నీ తండ్రి ముసలివాడయాడు. అతను నీకు రాజ్యం ఇచ్చి, నిర్విచారంగా తపస్సు చేసుకో బోతున్నాడు. నా ప్రభావం వల్ల, నీకు పట్టాభిషేకం చేయగలందులకు రేపు నీ తండ్రి మంత్రులను పంపుతాడు,'' అని చెప్పి అదృశ్యమయింది.



త్రిశంకుడు ఆత్మహత్యా ప్రయత్నం మానుకున్నాడు.

ఇంతలో నారదుడు అరుణుడి వద్దకు వెళ్ళి, ''నీ కొడుకు జీవితం మీద రోత పుట్టి ఆత్మహత్య చేసుకోబోతున్నాడు,'' అని చెప్పాడు.

అరుణుడు ఈ మాట విని బాధపడి, మంత్రులను పిలిచి, ''నా కొడుకు నేను పొమ్మన్నదే తడవుగా అరణ్యం పాలై పోయాడు. వాణ్ణి తెచ్చి రాజునుచెయ్యండి. నేను ఎక్కడైనా పోయి తపస్సు చేసుకుంటాను,'' అన్నాడు.

మంత్రులు వెళ్ళి త్రిశంకుణ్ణి తెచ్చి తండ్రికి చూపారు. తన కొడుకు తల అంతా జడలు కట్టి ఉన్నది. ముఖం విచారగ్రస్తంగా ఉన్నది. అరుణుడికి పశ్చాత్తాపం కలిగింది. రాజ్యం చేయవలసిన వాడు ఇలా అయిపోయినందుకు తానే కారణమని సిగ్గుపడుతూ, అతను కొడుకును కౌగలించుకుని, రాజనీతి చెప్పి, పట్టాభిషిక్తుణ్ణి చేసి, తాను భార్యతో సహా తపస్సు చేసుకోబోయాడు. అంబను కొలిచిన కారణంగా త్రిశంకుడికి వసిష్ఠుడి శాపంకూడా పని చెయ్యకుండా పోయింది. అతను మరో ఇంద్రుడిలాగా ప్రకాశిస్తూ, రాజ్యం చేయసాగాడు.

త్రిశంకుడు రాజ్యంచేస్తూ అనేక యజ్ఞాలుచేసి, ఎంతో కీర్తి తెచ్చుకున్నాడు. అతనికి హరిశ్చంద్రుడు అనే కొడుకు కలిగాడు. ఆ హరిశ్చంద్రుడు యుక్త వయస్కుడు అయేసరికి త్రిశంకుడు, తన కొడుకుకు రాజ్యాభిషేకంచేసి, తాను బొందితో స్వర్గానికి వెళ్లాలని నిశ్చయించుకున్నాడు.



అందుకోసం అతను వసిష్ఠుడి ఆశ్రమానికి వెళ్ళి, ఆ మహామునికి నమస్కారంచేసి, ''మహాత్మా, ఈ శరీరంతోనే నాకు స్వర్గసౌఖ్యాలు అనుభవించాలనిపిస్తున్నది. అప్సరలతో తిరుగుతూ, నందనోద్యానంలో విహరిస్తూ, గాంధర్వ గానం వినాలనిపిస్తున్నది. అందుకు తగిన యజ్ఞం ఏదన్నా ఉంటే చెప్పు.'' అన్నాడు.

''అయ్యా, మానవ మాత్రులకు స్వర్గంలో ఉండే అవకాశంలేదు. యజ్ఞాలు చేసిన వాళ్ళు చచ్చి స్వర్గానికి పోవటం ఉన్నదే, కాని నీ కోరిక పొసగేదికాదు. యజ్ఞం చేసినందువల్ల వచ్చే శరీరంతో అప్సరలతో సుఖించవచ్చు. బొందితో నిన్ను స్వర్గానికి పంపేశక్తి నాకు లేదు,'' అన్నాడు వసిష్ఠుడు, వెనకటి కోపాన్ని మరిచిపోకుండా.

దానికి త్రిశంకుడు, ''సరే, నీకు అంత గర్వమైతే, నాకు కావలసిన యజ్ఞాన్ని నేను ఇంకొక పురోహితుడి చేత చేయించుకుంటాను,'' అన్నాడు.

వసిష్ఠుడు ఈ మాటకు మండిపడి, ''దుర్మార్గుడా! నాకు కోపం తెప్పిస్తావా? నీలాగా గోవధ చేసి, బ్రాహ్మణ కన్యను అపహరించిన వాడికి ఇంకో శరీరం ధరించినా స్వర్గం లభించదు! నువు మళ్ళీ చండాలుడివైపో!'' అని శపించాడు.

వెంటనే త్రిశంకుడికి చండాలుడి రూపు వచ్చేసింది. ఆ రూపంతో అతనికి ఇంటికి పో బుద్ధి పుట్టలేదు. భార్య ఎంత పతివ్రత అయినా చండాలుడుగా మారిన భర్తను సహించదు. మంత్రులూ, బంధువులూ కూడా దగ్గిర చేరనియ్యరు. ఇలా బతికేకన్న చావు నయం. నిప్పుతోనో, విషంతోనో ఆత్మహత్య చేసుకుంటే, మళ్ళీ వచ్చే జన్మలో కూడా దుఃఖమే వెంటాడుతుంది. అందుచేత ఈ దేహం ఉన్నంత కాలమూ చండాలుడుగానే బతికి కర్మ అనుభవించటం మంచిది అనుకుని, అతను గంగాతీరం చేరి, అక్కడ అరణ్యంలో నివసించసాగాడు.

తన తండ్రికి కలిగిన దుర్గతి హరిశ్చంద్రుడికి తెలిసింది. అతను గంగా తీరానికి తన మంత్రులను పంపాడు. వాళ్లు త్రిశంకుణ్ణి కలుసుకుని, ''మహాత్మా, నీ కొడుకు నిన్ను తీసుకు రమ్మన్నాడు. నువు వచ్చి, వెనకటిలాగే రాజ్యం చెయ్యి. వసిష్ఠుణ్ణి ఎలాగో ఒకలాగ మంచి చేసుకో వచ్చు,'' అన్నారు.

''నేను ఈ అవతారంతో నగరానికి రాను. మీరు వెళ్ళి, నా కొడుకునే రాజ్యం చెయ్యమన్నానని చెప్పండి,'' అన్నాడు త్రిశంకుడు.



మంత్రులు వచ్చి త్రిశంకుడి ఆజ్ఞ తెలపగానే హరిశ్చంద్రుడు రాజ్యాభిషేకం చేసుకుని, పరిపాలన ఆరంభించాడు.

తరవాత త్రిశంకుడు జగన్మాతను ధ్యానిస్తూ గంగాతీరాన తపస్సులో కాలం గడుపుతూండగా, విశ్వామిత్రుడు తన తపస్సు పూర్తిచేసి, తన భార్యనూ, బిడ్డలనూ చూసుకోవటానికి ఆశ్రమానికి వచ్చాడు.

కరువు సంగతి విశ్వామిత్రుడికి తెలుసు. ఆ కరువుకు తన భార్యా, పిల్లలూ ఏమయారో ఆయన ఎరగడు గాని, తాను మాత్రం ఆకలికి తట్టుకోలేక, ఒక చండాలుడి ఇంట ప్రవేశించి, ఆహారం కోసం అతడి కుండలో చెయ్యిపెట్టి, దొంగతనం చేస్తూ దొరికిపోయాడు. అప్పుడాయన చండాలుడితో తాను తపస్వినని, ఆకలి బాధకు తట్టుకోలేక దొంగతనానికి పాల్పడ్డాననీ చెప్పుకుని, తన ప్రాణం నిలబెట్టుకున్నాడు.

''అయ్యా, ఇది కుక్కమాంసం. నువు ఎలా తింటావు?'' అని చండాలుడు విశ్వామిత్రుణ్ణి అడిగాడు.

''ఆకలి ధర్మం ఎరగదు. కుక్కమాంసమని నాకు తెలుసు. నేను దాన్ని తినటం పాపమైతే, ఆ పాపం వాన దేవుడిది!'' అన్నాడు విశ్వామిత్రుడు.

విశ్వామిత్రుడు ఇలా అనగానే ఏనుగు తొండాలంత ధారలతో వాన కురిసింది.

విశ్వామిత్రుడు బయలుదేరి ఇంటికి వచ్చాడు. భర్త అడిగిన మీదట భార్య తమను త్రిశంకుడు ఎలా ఆదుకున్నాడో చెప్పింది. త్రిశంకుడు వసిష్ఠుడి గోవును చంపినది కూడా తమకోసమేననీ, దాని ఫలితంగా అతను శాపగ్రస్తుడయాడనీ ఆమె చెప్పేసరికి, విశ్వామిత్రుడు అతన్ని వెతుక్కుంటూ వెళ్ళి, "రాజా, నువు నా భార్యకూ, బిడ్డలకూ ఉపకారం చేశావు. నీకు ప్రత్యుపకారం చేస్తాను," అన్నాడు.

త్రిశంకుడు వసిష్ఠుణ్ణి అడిగినట్టే తనను బొందితో స్వర్గానికి పంపమని విశ్వామిత్రుణ్ణి అడిగాడు. వసిష్ఠుడి శాపం పోగొట్టటానికి విశ్వామిత్రుడు యజ్ఞం చేయింతామనుకున్నాడుగాని వసిష్ఠుడు మునులను యజ్ఞానికి పోనివ్వలేదు. యజ్ఞం సాధ్యంకాలేదు.

అప్పుడు విశ్వామిత్రుడు తన తపశ్శక్తి అంతా త్రిశంకుడికి ధారపోసి, "ఇక నువు స్వర్గానికి వెళ్లిపో. నిన్ను ఎవడూ ఆపలేడు!" అన్నాడు.

విశ్వామిత్రుడు తనకు ధారపోసిన తపశ్శక్తితో త్రిశంకుడు పక్షిలాగా ఎగురుతూ స్వర్గం కేసి వెళ్ళాడు.

చండాలుడి ఆకారంలో ఒక మనిషి స్వర్గం కేసి వస్తూ ఉండటం చూసి, దేవతలు ఇంద్రుడితో ఆ మాట చెప్పారు. ఇంద్రుడు వెళ్ళి, "చండాలుడివి! స్వర్గానికి ఎలా వస్తావు?" అని త్రిశంకుణ్ణి తోసేశాడు.

త్రిశంకుడు తిరిగి భూమి మీదపడుతూ, "దేవతలు నన్ను స్వర్గం నుంచి తోసేస్తున్నారు!" అని అరిచాడు.

వెంటనే విశ్వామిత్రుడు తన తపశ్శక్తితో త్రిశంకుణ్ణి దారిలో ఆపి, కింద పడకుండా చేశాడు. అంతేగాక ఆయన త్రిశంకుడి కోసం మరో స్వర్గాన్ని సృష్టి చేశాడు. ఈ సంగతి తెలిసి ఇంద్రుడు విశ్వామిత్రుడితో కొత్తసృష్టి చేయవద్దని చెప్పి, త్రిశంకుడికి కొత్త శరీరం ఇచ్చి, తన వెంట తిన్నగా స్వర్గానికే తీసుకుపోయాడు.





# మీసాలయ్య-గుండయ్య

కమల గుడి నుంచి ఇంటికి తిరిగి వచ్చే సరికి, ఆమె తండ్రి రామయ్య ఎవరితోనో మాట్లాడుతున్నాడు. ఆయన కమలను తన కూతురిగా వారికి పరిచయం చేశాడు. కమల వాళ్ళకు నమస్కారం చేసి, లోపలికి వెళ్ళిపోయింది.

రామయ్యతో మాట్లాడుతున్న వారు తండ్రి, కొడుకులు. కొడుకును కమల రెండు మాసాల క్రితం తన స్నేహితురాలి పెళ్ళిలో చూసింది. అతను పెళ్ళికొడుకు స్నేహితుడు; పెళ్ళి జరిగినంతసేపూ చురుకుగా తిరిగాడు. అతని పేరు రవి. ఇప్పుడు ఈ రవి, తన తండ్రిని తీసుకుని తమ ఇంటికి ఎందుకు వచ్చాడో కమల ఊహించలేక పోయింది.

ఇంతలో రామయ్య లోపలికి వచ్చి, ''వాళ్ళు చాలా గొప్పవాళ్ళు, ఆ అబ్బాయి నిన్ను ఎక్కడో చూసి ఇష్టపడ్డాడట! తండ్రిని తీసుకుని వచ్చాడు. కాని తండ్రి కనీసం పదివేలు కట్నం కావాలంటున్నాడు. మనం తూగలేం. వాళ్ళకు ఇంత ఫలహారంపెట్టి పంపించేద్దాం!'' అన్నాడు కమలతో.

కమల పరధ్యానంగా ఫలహారం తయారుచేసి, వచ్చిన వారికి ఇచ్చింది. రవిని పెళ్ళాడటానికి ఆమెకు ఇష్టంగానే ఉన్నది. కాని పదివేలు కట్నం ఎక్కడి నుంచి తెచ్చేటట్టు ?

రామయ్య వారితో తాను పదివేలు కట్నం ఇచ్చుకోలేనని స్పష్టంగా చెప్పి, ఆ తండ్రి కొడుకులను వీధి చివరదాకా సాగనంపాడు.

కాని అయన ఇంటికి తిరిగి వచ్చినాక, మనసు మార్చుకున్న వాడిలాగా, ''కాళ్ళ దగ్గిరికి వచ్చిన సంబంధం వదులుకోవడం అవివేకం అవుతుంది! ఈ సంబంధం

మాచిరాజు కామేశ్వరరావు



నీకు నచ్చితే పెళ్ళి చేస్తాను,'' అని కమలతో అన్నాడు.

''మరి కట్నం మాటో ?'' అన్నది కమల.

''అదేదో నేను చూసుకుంటాలే! ఈ సంబంధం నీకు ఇష్టమని నీ మొహమే చెబుతున్నది!'' అన్నాడు రామయ్య.

అయన అన్నంత పనీ చేశాడు. నిశ్చయ తాంబూలాలు పుచ్చుకోవడమూ పదిహేను రోజుల్లో ముహూర్తం నిర్ణయించడమూ కూడా అయిపోయింది!

కట్నం డబ్బు ఎలా ఏర్పాటు అవుతున్నదీ కమలకు అంతుబట్టలేదు. తండ్రిని అడిగితే కస్సుమన్నాడు.

రాత్రికి పెళ్ళి అనగా పెళ్లివారు తరలి వచ్చారు. కరణంగారి ఇల్లు పెళ్ళివారి విడిది.

కమలను అమ్మలక్కలు పెళ్ళి కూతురుగా ముస్తాబు చేస్తూండగా, ''మా వాడి ఎన్నిక చూడాలి! పెళ్ళికూతురు ఏదీ ?'' అంటూ ఒక మనిషి అక్కడికి వచ్చాడు. అతనికి పొడవైన మీసాలూ, గిరజాల జుట్టూ ఉన్నది.

''నా పేరు మీసాలయ్య. పెళ్లికొడుక్కు తండ్రిలాటి వాణ్ణి!'' అన్నాడు మీసాలయ్య, మీసాలు దువ్వుకుంటూ.

కమల ఆయన పాదాలకు నమస్కారం చేసి, ఆశీర్వాదం పొందింది. పెళ్ళివారి తాలూకు పెద్ద అని తెలియగానే, మీసాలయ్యకు కాఫీ, ఫలహారమూ ఏర్పాటు చేసి, రామయ్య చాలా మర్యాదచేశాడు.

మీసాలయ్య ఫలహారం ముగించి, తిన్నగా విడిదికి వెళ్ళి, ''మా అమ్మాయి ఎన్నిక చూడాలి! పెళ్ళికొడుకు ఏదీ? నా పేరు మీసాలయ్య. పెళ్ళికూతురు నాకు కూతురులాటిది!'' అన్నాడు, పెళ్లికొడుకు తండ్రి రాజయ్యతో.

రాజయ్య మీసాలయ్యకు మర్యాదచేసి, తన కొడుకు రవిని చూపించి, ''మీ పెదమామగారు!'' అంటూ రవికి పరిచయం చేశాడు.

మీసాలయ్య రోజల్లా పెళ్ళివారింటికీ, విడిదికీ మధ్య తిరుగుతూ తగని హడావుడి చేశాడు. అతను ఎవరితరపు మనిషి అయినదీ నిర్ధారణ చేసుకున్నవారు లేరు. మొత్తం మీద అతను రెండు పక్షాలా పెత్తనం చేశాడు. రెండు పక్షాలవాళ్ళూ ఆయన మాట ఆదరించారు.

ఆ సాయంకాలం విడిదిలో నలుగురి మధ్య మాట్లాడుతున్న రాజయ్యతో మీసాలయ్య, "బావగారూ, ఒకసారి మీరు ఇలా వస్తారా? మీతో కట్నం విషయం మాట్లాడాలి," అన్నాడు.

కట్నం అనగానే రాజయ్య తక్కున లేచి వచ్చాడు. విడిది చాలా కోలాహలంగా ఉన్నది. రాజయ్య మీసాలయ్యను లోపలి గదిలోకి తీసుకుపోయాడు.

"మా తమ్ముడు కట్నం డబ్బు—" అని మాట పూర్తి చేయకముందే మీసాలయ్యకు తీవ్రమైన దగ్గు తెరవచ్చింది. అతను దగ్గుతూనే మంచి నీళ్ళు కావాలని రాజయ్యకు సైగచేశాడు.

రాజయ్య ఇవతలికి వచ్చి, చెంబుతో నీళ్లు సేకరించి, మళ్ళీ గదిలోకి వెళ్లాడు.

మీసాలయ్య మంచి నీళ్ళు తాగి, కొంచెం తేరుకుని, "కట్నం డబ్బు ఇప్పుడే పట్టుకురమ్మంటారా అని మా తమ్ముడు అడగ మన్నాడు," అన్నాడు.



"పట్టుకు రమ్మనండి," అన్నాడు రాజయ్య ఆత్రంగా.

మీసాలయ్య అక్కడి నుంచి పెళ్ళివారింటికి వెళ్ళి, నలుగురి మధ్య ఉన్న రామయ్యను, "బావగారూ, ఇలా వస్తారా? ముఖ్యమైన విషయం!" అని పక్కకు పిలిచాడు.

రామయ్య మీసాలయ్యను లోపలి గదిలోకి తీసుకువెళ్ళాడు.

మరి కాస్సేపటికి రామయ్య, "మంచి నీళ్ళు! మంచి నీళ్ళు!" అంటూ ఇవతలికి వచ్చి, "మీసాలయ్య దగ్గుతెరతో ఉక్కిరి బిక్కిరి అవుతున్నాడు," అని, మంచి నీళ్ళతో మళ్ళీ గదిలోకి వెళ్ళాడు.



మరి కాస్సేపటికి మీసాలయ్య అందరూ చూస్తుండగా గదిలోనుంచి వచ్చి, బయటికి వెళ్ళిపోయాడు.

ఇంకా కొంత సేపటికి గదిలో నుంచి రామయ్య వెర్రి కేక పెట్టడం వినిపించి, అందరూ వెళ్ళారు.

రామయ్య పెట్టె ముందు కూర్చుని, పెట్టెలో ఉన్న గుడ్డలూ అవీ కంగారుగా ఇవతలికి లాగుతున్నాడు.

''కట్నం డబ్బు కనబడదు! పదివేలు! వియ్యంకుడు ఇప్పుడే పంపమన్నాడట! మీసాలయ్య చెప్పి వెళ్ళాడు. మీసాలయ్య తప్ప ఈ గదిలోకి ఇంకెవరూ రాలేదు. దగ్గు వంకన నన్ను బయటికి పంపి, డబ్బు కాజేశాడు! దొంగ! పట్టుకోండి! పట్టుకోండి!'' అంటూ రామయ్య కేకలు పెట్టాడు.

ఇంతలోనే రాజయ్య కేకలుపెడుతూ వచ్చాడు: ''ఆ మీసాలయ్య ఎక్కడ? నా సొమ్ము అయిదు వేలు కాజేశాడు! దగ్గు నటించి, నన్ను అవతలకు పంపించి, కొంపతీశాడు!''

''మీసాలయ్య నా పదివేలూ కాజేశాడు!'' అని రామయ్య అరిచాడు.

''మీసాలయ్య నా అయిదు వేలూ కాజేశాడు,'' అని రాజయ్య అరిచాడు.

అప్పుడుగాని మీసాలయ్య ఎవరి తాలూకు మనిషి అన్న ప్రశ్న రాలేదు. తీరా విచారిస్తే అతను ఎవరి మనిషీ కాడు! అతని కోసం కుర్రవాళ్లు వెతికారు గాని లాభం లేకపోయింది.

రవి తన తండ్రిని పక్కకు పిలిచి, ''కట్నం గొడవ వద్దంటే విన్నావు కావు! ఎంత రభస జరిగిందో చూడు. నీకున్న డబ్బుయావ గ్రహించి ఆ మీసాలవాడు నిన్ను కట్నం పేరుతో గదిలోకి తీసుకుపోయి, అయిదువేలూ కాజేశాడు. ఇంకా నయం అడుగున ఉన్న పాతికవేలూ, నగలూ వాడి కంటపడలేదు. ఇప్పటికే మనం నవ్వులపాలు అయిపోయాం. ఇంక కట్నం మాట ఎత్తకు!'' అన్నాడు.

ఇంతలో ఎవరో ముహూర్తం సమీపిస్తున్నది అనడంతో, నలుగురూ రవిని పెళ్ళిపీటల మీద కూర్చోబెట్టేశారు.

పెళ్ళి నిర్విఘ్నంగా జరిగిపోయింది.

పెళ్ళి అయిన మర్నాడు పెళ్ళివారు నాలుగు జట్కా బళ్ళ మీద బయలుదేరారు. బండిలో కమల రవితో, "ఆ మీసాలయ్య ఎంతపని చేశాడూ! మా నాన్న డబ్బేగాక, మామగారి డబ్బు కూడా పోవడం బాధగా ఉన్నది." అన్నది.

రవి నవ్వి, "ఏ డబ్బూ పోలేదు. అదంతా నేనూ, మీ నాన్నా ఆలోచించి వేసిన పథకమే. మా నాన్న డబ్బుమనిషి, కట్నం లేనిదే పెళ్లి జరగదని ఖచ్చితంగా చెప్పేశాడు. మీ నాన్న మమ్మల్ని సాగనంపుతూ వచ్చినప్పుడు, మా నాన్న బండివాడితో బేరమాడుతూండగా, మీ నాన్నను పక్కకు పిలిచి, ఈ ఉపాయం చెప్పాను. ఆయన ఒకంతట ఒప్పుకో లేదనుకో! మీసాలయ్య నాకు తెలిసిన వాడే! అతను తన కూతురి పెళ్ళికోసం అప్పు అడిగితే మా నాన్న ఇయ్యలేదు నేను అంతకు ముందే పెట్టెలో నుంచి అయిదువేలు తీసి రహస్యంగా మీసాలయ్యకు ఇచ్చేశాను. మీసాలయ్య తన మీద అందరికీ అనుమానం కలగడానికే దగ్గు తెచ్చిపెట్టుకున్నాడు. మీ నాన్న దగ్గిర కట్నం డబ్బు ఎక్కడ ఉన్నది? తన అయిదువేలూ పోవడంతో, మా నాన్న కట్నం డబ్బు కూడా పోయే ఉంటుందని నమ్మేశాడు." అన్నాడు.

"మీరు ఎంత మంచివారు! కట్నం లేకుండా నన్ను చేసుకున్నారు. కాని, పాపం, మీసాలయ్య లోకందృష్టిలో దొంగ అయి కూర్చున్నాడే!" అన్నది కమల.

"మీసాలయ్య వెర్రివాడు కాడు. అతని అసలు పేరు గుండయ్య. ఆ మీసాలూ, జులపాలూ పెట్టుడువి. ఎంత చెడ్డా నాటకాల్లో వేషాలు వేసేవాడు కావటాన గొంతు కూడా మార్చాడు. తన కొడుక్కు ఉద్యోగం రాగానే అయిదువేలూ ఇచ్చేస్తాడు." అన్నాడు రవి.



## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 25 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1980 నవంబర్ నెల సంచికలో ప్రకటింపబడును.



Brahmdev





N. Pakkirisamy

- ★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకు సంబంధం ఉండాలి.)
- ★ సెప్టెంబర్ నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంతమాత్రమూ పరిశీలింపబడవు.
- ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రూ. 25/–లు బహుమానం.
- ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, (వ్యాఖ్యలకు సంబంధించని ఇతర విషయాలేవీ చేర్చరాదు.) ఈ అడ్రసుకు పంపాలి :–చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు–26.

---

## జూలై నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : ఎత్తుకొన్నది అమ్మకాదు

రెండవ ఫోటో : పడుకొన్నది పిల్లకాదు

పంపినవారు : పోలిశెట్టి శ్యామలాంబ, గున్నేపల్లి. (తూర్పు గోదావరి జిల్లా)

బహుమతి మొత్తం రు. 25/–ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 188, Arcot Road, Madras-600 026 (India). Controlling Editor: NAGI REDDI.



64

# చందమామ కేమెల్ రంగుల పోటీ

ప్రవేశ రుసుము లేదు



**బహుమతులు గెలుచుకోండి**

- కేమెల్—మొదటి బహుమతి రు. 15
- కేమెల్—2వ బహుమతి రు. 10
- కేమెల్—3వ బహుమతి రు. 5
- కేమెల్—5 కన్సొలేషన్ బహుమతులు
- కేమెల్—10 సర్టిఫికెట్లు

చుక్కలు పెట్టిన గీత వెంట కత్తిరించండి.

12 సంవత్సరముల లోపల వయస్సు గల్గిన విద్యార్థులు మాత్రమే పాల్గొన గలరు. పై చిత్రాన్ని ఏ కేమెల్ రంగుతోనైనా రంగు వేయండి. రంగు వేసిన ప్రవేశ పత్రాలను ఈ క్రింది అడ్రసుకు పంపండి.

P.B. No. 9928, COLABA, [illegible] 00 005.

ఫలితములు తుది నిశ్చయముగా[illegible] త్తరములు అనుమతించబడవు.

Name ________________ ____________ Age ______________

Address ____________ ____________________________

దయచేసి మీ పేరు, చిరునామా, ఇంగ్లీషులోనే వ్రాయండి.

VISION

బొమ్మకు పూర్తిగా రంగులు వేయాలన్నది గుర్తుంచుకోండి.

**CONTEST NO.16**

ఎంట్రీలు పంపుటకు ఆఖరు తేదీ. *30-9-1980*

# బ్రిటానియా పాల బిస్కట్

## పెరిగే పాపాయిలకు రుచివంతమైన తోడు!

రుచికరమైన, పుష్టికరమైన

**బ్రిటానియా**

## మిల్క్ బికీస్




లింటాస్-BBC.MB.3-1712 TL

# కళ్ళు మూసుకో ఏమి కావాలో కోరుకో



మీరు పొదుపుచేసితే మీ కోర్కెలు నిజమవుతాయి. సైకిలా! బొమ్మరిల్లా! ఆటవస్తువా! ఏదయినా మీ డబ్బుతో మీరే కొనుక్కోవచ్చును. కెనరా బ్యాంక్ **బాల క్షేమనిధి** మీ కోసమే! అందమయిన **బాల క్షేమనిధి** పెట్టె మీ పైసలు దాచుకోవడానికి బాగుంటుంది. దానికి తాళము కూడ వేసుకోవచ్చును. మీ పెట్టె నిండగానే దగ్గిరగా వున్న కెనరా బ్యాంకులో డబ్బును జమచేసి తిరిగి దానిలో కూడబెట్టవచ్చును. మీ డబ్బు పెరుగుతూ వుంటుంది. ఎందుకంటే మేముకూడ కొంత మొత్తము కలుపుతాము కనుక. త్వరలోనే ఆ మొత్తము మీరు కోరుకొనిన వస్తువు కొనుక్కోటానికి సరిపోతుంది. మీ కోర్కెలు తీరడానికి ఇలాంటి గొప్ప పద్ధతో చూశారా! పొదుపు చేయడానికి యెంతటి అద్భుతమయిన పద్ధతో చూశారా!

మీకు దగ్గిరలోనున్న కెనరా బ్యాంక్ శాఖకి వెళ్ళి వివరములను తెలుసుకోండి.

మా యితర ప్రత్యేక ప్రణాళికలు

**కామధేను, నిరంతర, విద్యానిధి.**

## బాలక్షేమ నిధి




## కెనరా బ్యాంక్




(జాతీయ బ్యాంక్)
1200కు పైగా శాఖలు దేశమంతటా కలవు.

# చందాదారులకు గమనిక

'చందమామ' కాపీలు పంపుటకు మీ చిరునామాలో ఏదైనా మార్పుంటే 5-వ తేది లోగానే, మీ చందా నంబరు ఉదహరిస్తూ మాకు తెలపాలి, ఆలస్యమైతే మళ్ళీ నెల వరకు మీ క్రొత్త అడ్రసును అమలు పెట్టడానికి వీలుండదు.

డాల్టన్ ఏజన్సీస్
'చందమామ బిల్డింగ్స్'
మదరాసు - 26

CHANDAMAMA (Telugu) SEPTEMBER 1980 Regd. No. M. 4854